# శూరసంసోను



(సద్గ్రంథోక్త ఐదంకముల నాటకము)



గ్రంథకర్త:

శ్రీ అడ్డాడ వీరభద్రాచారిచే

పత్త్రాభిప్రాయము

సూచనలననుసరించి



ప్రకాశకులు:

కుతుకూరి సుబ్బారావు సన్

(కరుకూరి స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు)

ప్రొప్రయిటరు : సరస్వతీ బుక్ డిపో

బెజవాడ

1946

రు 1—0—0

# విజ్ఞప్తి

నే నిటీవల ఉద్యోగము నుండి ఖాళీగానుండ వలసి నదినములు కొన్ని సంప్రాప్తించినవి. సంగీతమునందు, నాట్యకళ యందభిరుచిగల వాఁడ నగుటచే క్రైస్తవ జన సామాన్యమున కేదైన నొక నాటక ముండిన బాగుండునని తలఁచి యీ ప్రయత్నమునకు పూనుకొంటిని. తగు సమర్థుఁడను కాకపోవుట వలన నాకీయానందము నెవరీయఁ గలరాయని వెతకితిని.

నాకు సమీపము నందలి ముదునూరు గ్రామ వాస్తవ్యులు శ్రీ అడ్డాడ వీరభద్రాచార్యులుగారి పరిచయము లభించినది. వారికి విషయము నెఱుక పఱచి, "పాత నిబంధన"లోని సంసోను కథా భాగమును వినిపించి, నాటక రూపమున తయారు చేయ వలసినదిగా కోరితిని. పదునైదు దినములలో నారింటికి వెళ్ళితిని ఆకాలమున నన్ను చూచుట తోడనే రచించి నాకిచ్చిరి.

నాటక మాడించ వలెనను యాశగలిగి సమర్థులగు నటులతోను ఎనిమిది వాద్యములతోను ఒకతూరి నాటకమును బొళ్ళపాడు గ్రామములో ఆడించితిని. ప్రేక్షకులు కడు ఉత్సాహమును కనుపరచిరి. సంసోను పాత్రధారియు నామిత్రులునగు, టి హెంచ్ కోటయ్యగారు "ఆనందమిదియేగా" "పరమాత్మ శ్రీయెహోవ" యను కీర్తనలను వారు స్వయముగ వ్రాసి నాటకమున పాడి వన్నెఁ దెచ్చిరి.

ఈ నాటక రచనోద్యమమున మాకెంతయు తోడ్పడిన శ్రీ ముదునూరు సత్య నారాయణ మూర్తిగారికిని, తమ యభిప్రాయముల నొసగిన మహాశయులకును యీ గ్రంథ ప్రచురణా ముద్రణ భారములను వహించిన కురుకూరి సుబ్బారావు సన్ సరస్వతీ బుక్ డిపో బెజవాడ వారికిని నేనెంతయు కృతజ్ఞుఁడను.

బొళ్ళపాడు
4-5-46

ఇట్లు విధేయుఁడు,
నత్తా అబ్రహాము.

# గ్రంథకర్త మనవి



గుణగ్రహణ పారీణులారా !

బొల్లపాడు గ్రామకాపురస్థుఁడు వత్తా అబ్రహాము యీనాటకము రచించ వలసినదిగా నన్ను ప్రేరేపించెను. నాటక రచనయందు అలవాటు లేక పోయినను అతని ఉత్సాహమును ఊతగా తీసికొని నా మిత్రులగు మునగనూరు వత్స నారాయణ మూర్తిగారి సహాయముతోను ప్రయత్నించి నే నీగ్రంథమును పూర్తిచేసి అతని కిచ్చితిని.

ఈ నాటకము నందలి కథా విధానము, భావ కల్పనము హైందవ నాటకముల ననుసరించి చాల వరకు చిత్రించితిని. ఇందు శృంగార కరుణా వీర రసములకు ప్రాధాన్యమియ్య బడినది. ప్రాజ్ఞులు యిందలి దోషములను త్యజించి గుణములను స్వీకరింతురుగాక !

ఇట్లు
సుజన విధేయుఁడు
(సం) అడ్డాడ వీరభద్రాచార్యులు.

మునగనూరు
21-11-45



# తొలి పలుకు

ఈ దృశ్యకావ్యము నా మూలముఁ బ్రతించితిని. మూఁడు గంటలకాలములోఁ బ్రదర్శింప ననువుగల నాటకమును నానందము మాత్రము నన్నుఁ వివశుఁ జేసినది. ఇందలి యితివృత్తము పవిత్ర గ్రంథమగు 'బైబిలు'నుండి పరిగ్రహింపబడినది ఇందలి నాయకుఁడు సంసోను, ఎడనెడ నాయకునివల్ల వీరోచితమగు ధీరోద్ధత్యము కాన్పించినను, జీవితము శృంగార భూయిష్ఠమగుడు నాతఁడు ధీరలలిత నాయకుఁడని చెప్పక చెప్పుచున్నది.

ఈ కవి తన నాటకమున నింకొక క్రొంగ్రొత్త పోకడఁ జూపి. మార్గదర్శియైనాఁడు అది యెద్ది యన, ఏ యిత్నాకలనాఁడో ప్రకల్పించిన "సుఖాంత నాటకం" అను సూక్తికి విపర్యయముగా విషాదాంతముగా నీ నాటకమును బర్యవసింపఁ జేసినాఁడు. సుఖాంతములఁ జూచి ప్రాపంచిక వ్యవస్థ నిదమిత్థమని తేల్చలేక కేవలానందమే జీవితావధి యని మురియుట యవి వశ్చిత విషయమేమో! యని యనిపించును. చిత్తవృత్తులఁ గలఁచి మంచి చెడుగుల నూహింపమార్గమ్ము నేరుపరచి జీవిత రంగమున వింత వింత పరిణాములఁ జిత్రింపఁ జాలు రూపకము విషాదాంతమనియు, నదియే ప్రదర్శోచితమనియు, నాయభిమతము.

"ఏకోహిదోషో గుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అనునట్లు అల్పదోషము పరిగ్రాహ్యముకాదు. ఇందలి సంభాషణ లెంతయు ముద్దుల మూటఁ గట్టుచు సామాన్య ప్రాసీకమునకుఁగూడ కథావస్తువు తేటతెల్లమగునట్లుగా నుండి నన్నలరించినవి.

ఈ నా[illegible] పోషకుఁడయిన అబ్రహాము పరిణతి యెంతయు సుచితజ్ఞతను వహించుచు, సంభాషణలనతని వాగ్దేవి విద్వచ్ఛ్రయైనది. అతఁడిట్టి సంస్కృతినేగాక ప్రదర్శన భారముఁగూడ వహించి యెంతయు స్తుతిపాత్రుఁడయ్యెను.

ముఖ్యముగా క్రైస్తవ సమాజమున నిట్టి యభిరుచిగల విశేష
జ్ఞులుండుటకును, అపూర్వమైన వారిమతగ్రంథమునుండి చక్కని గాథ
నెత్తి రూపకముగాఁ జిత్రింపఁ జేయుటకును. నీవ్రాతకుఁడు స్తుతి
పాత్రుఁడు. ఈకవి విశేషశ్రమ కోర్చి యింతయుత్తమ గ్రంథము
లెన్నోమున్ముందు విరచించి వన్నెకెక్కఁగావు తమని యాశిసము.

ఇట్లు శ్రీ యు: శామి
విద్వాన్
కోనేరు కుటుంబరావు,
ఆంధ్రోపాధ్యాయుడు
బోర్డు హైస్కూలు.

గుడివాడ.
2-12-45

---

## OPINION

M R Ry P Satyanandam M. A. B. Ed., A. M; F. R. E. S.

Christian subjects are rarely dramatics. Drama is the best form to express the truths of religion to the people in such a way that even the illeterate can understand. Mr. Abraham has tried his best to keep the word of God in tact; and it is written in such a way that it would appeal an attractive villager, and this drama should be encouraged in every part of the Andhra Desa by every christian of any denomination.

P. Satyanandam M. A; B,Ed.
A. M. (Columbia)
F. R. E. S (London)
Lecturer
A. C. Collage, Guntur.
30 th Jan '46

---

# OPINION

M. R. Ry G. Veukataratuana garu B A; B. Ed.
Deputy Inspector of School, Bezwada.

బైబిలు గ్రంథమునుండి గ్రహించిన ఈకథకు కొంగ్రొత్త రూపము నిచ్చి నూతన సొంపుతో వెలయింపజేసిరి. మిల్టనుకవి యాంగ్లమున వ్రాసిన పద్యగీతికను చదివినప్పుడెట్టి యానందము కలిగెనో యీనాటకమును చదివినప్పుడట్టి యానందము కలిగెను. ఇందలి పద్యములు కీర్తనలు రసవంతములు. చివరవరకు కవి కథయందలి విషయము చెడకుండ రసమును పోషించిరి. సామాన్య ప్రజలుకూడ చదివి, చూచి యానందింపదగినది.

ఇందుకు వ్రాసిన ఉపోద్ఘాతములు (M] Satyanarana-moorty & N{Abraham) కడు ప్రశంస నీయములు,

BEWADA
5-12-45

(Sd) G] Venkataratnam,
Deputy Inspector of School

---

Andl ra Christian Gaadharva M. Abraham Bhagavatar,
VIDYA NAGAR

శూరసంహారను నాటక పుస్తకమును నేను సాంతముగ చదివితిని. ఈ కాలమునకు తగిన రసపోషణలిందున్నవి ఈనాటకోద్ధరణకు వ్రాసిన వత్సా అబ్రహాముగారు నాకు చిరకాలపరిచితులగుట యేగాక సనాతన గ్రామఫోను రికార్డులలో పాడినవారని లోకవిశదమే. వీరు అనేకను నాటకములను వ్రాయుంచి క్రైస్తవ నాటకరంగమునకు వన్నెదెత్తురుగాక. దేవుడు వీరికి ఆయురారోగ్యైశ్వర్యముల ననుగ్రహించుగాతయని నా ప్రార్థన.

క్యాంపు: వెన్నవపూడి
29—12—45

ఇట్లు శ్రేయాభిలాషి
యం. అబ్రహాం

# పాత్రలు

—♦ పురుషులు ♦—

సంసోను ... కథానాయకుడు

మానోహా ... సంసోనుతండ్రి

దేవదూత ...

సత్యమూర్తి ... పురోహితుడు ... సంసోను పెండ్లిగురువు

తిమ్నాతీయుడు ... సంసోను మామ

సర్దారులు (ఇద్దరు) ... ఫిలిస్తీయనాయకులు

యూదులు (ఇద్దరు) ... యూదాదేశపుపౌరులు

పౌరులు (ఇద్దరు) ... ఇశ్రాయేలీయులు

మంగలి ...

భటులు (ఇద్దరు) మహమ్మదీయులు జైలుకావరులు.

—♦ స్త్రీలు ♦—

మనోరమ ... సంసోను తల్లి

సరోజ ... సంసోను భార్య

సౌగంధిక ... సంసోను అత్త

వేశ్య ... గాజాపట్టణపు వేశ్య

డెలీలా ... శోరేకుపట్టణపు వేశ్య

సూ:—పాత్ర లెక్కువగా నున్నను 12 మందితో దీనిని సులభముగ ప్రదర్శించ వచ్చును. ప్రథమాంక మంతయు ఒక బాలునిచే సంసోను పాత్రను వేయించ వలెను.

—:o:—

# ప్రార్థన పద్యములు

—:o:—

[సెంటరు క్లాసు లందును యితర ప్రార్థన లందును పాడుకొనుట కుపయుక్తము లైనవి]

ఉ॥ ఆది నెవండు దేవుఁడను ♦ నాహ్వయమున్ వహియించి యుంచె, సృ
ష్ట్యాదిని భూత పంచకము ♦ నా పయి భూతములంవిదితప్రహా
మాదిరి నిల్పె నెవండ స ♦ మాన గుణాఢ్యుఁడు వాని సూనుఁడై
మేదినిపై దయానిధిగ ♦ మించిన క్రీస్తుని ప్రస్తుతింపరే.

చ॥ పరమ కృపాతిరేకమున ♦ పాపుల దుఃఖ విమోచనార్థమై
మరియకు బిడ్డవై జగతి ♦ మానిసివై జనించి, సు
స్థిర తర ప్రేమ మార్గమును ♦ తీయని మాటల బోధఁజేసి దే
వరసమ దివ్య తేజమున ♦ వర్తిలి నాఁడవు ఏసుసత్ప్రభో

మ॥ నవ నీతంబున కంటె నెక్కుడుగఁగా ♦ నన్వచ్చు నీ చిత్తమా
ర్ద్రవమే యొల్లకుఁ గల్గు! బాధలకు సం ♦ తాపించి మోక్షంపుమా
ర్గ విశేషంబు నుపన్యసించుచును స్వా ♦ ర్థత్యాగముంజూపితి
వవనిం నీసము లేరి? యెన్నఁదగు దే ♦ వా! యేసుక్రీస్తుప్రభో.

ఉ॥ నీకరుణారసాతి భర ♦ నేత్రవినిర్గత కాంతులెంతయున్
బైకొన నీగభీరమ్మృదు ♦ భావము దీనుల శోక వేడ్కతో
నీకమునీయమాత్రి తమ ♦ నేత్రములంగని కట్టివారతే
లోకమునందు మానవుల ♦ లోకదు ధన్యులు యేసుసత్ప్రభో.

శా॥ నీసౌజన్యము నీ మహామహిమనీ ♦ నిర్హేతుక ప్రేమయుం
నీసౌశీల్యము యిట్టిదట్టిదని వ ♦ ర్ణింపంగ నాకట్టిదా
ధీసామర్థ్యము లేదు; ఐనను దయా ♦ దీనాంతరంగుండవా
హా! సాకంగల పెట్టి వారలను దే ♦ వా! యేసుక్రీస్తుప్రభో.

శ్రీ అడ్డాడ.

———

శ్రీ జగద్రక్షకాయనమః

# శూరసంసోను.



## ప్రథమాంకము.

### మొదటి రంగము.

[మనోరమ దోసిలొగ్గి మోకాళ్ళూని ఆకాశమువంక చూచుచు]

1. కీర్తన: రాగం - మాండ్ జిల్లా - తాళం: త్రితాల,
ఓదేవా! సుజనానంద హేపాహిమాం। ఓ.
దేవాదేవ - కరుణాసాగర।
పరంధామ - పాపహారి, ఓదేవా.

తండ్రీ! దయాపరా! నీవవాఙ్మానసగోచరుండవు, అమేయుం డవు, అనంతుండవు. నీప్రభావ మగమ్యము.

తే. గీ. లీలలోకంబులెల్లను ♦ నేలువాఁడ
వింత వింతల చెయ్వుల ♦ వెలయువాఁడ
జీవులను తోలుబొమ్మలఁ ♦ జేయువాఁడ
మించువేడుక తోడ నా ♦ డించువాఁడ. 1

ప్రభూ! యెహోవా! నీకృపతొలఁగి యిశ్రాయేలీయులు ఫిలి స్తీయులకు బానిసలైరి. వారల నుండి మాకు విమోచనయే లేదా? ఇశ్రాయేలీయ దాస్యవిమోచన కొఱకును, ఫిలిస్తీయుల సాధించుట కొఱకును నీపూర్ణ ప్రభావమును మాపై కనుపరచవా?

చిరకాలానుగతమైన నాయీ కాంక్ష సంతానహీనురాలనగు నాకు, యిశ్రాయేలీయుల రక్షకమూర్తియగు నొకబిడ్డ నొసఁగినగాని తీరదు. నిన్నంతాననగు నాజీవితము పాడుపడిన గేహమునందలి దీపిక. చంద్రుడు లేని శోభారహితమైనరాత్రి.

సీ. అంటినఁ గందునా ♦ యలరుల బంతినా
నెమ్మను చేతుల ♦ నిమురుటెప్పుడో,
పాలబుగ్గలు బొట్టెఁ బడ కేరి నవ్వుచోఁ
గాంచి సమ్మదమునేఁ ♦ గాంచుటెపుడో,
చేతులల్లాడించి ♦ శిరము తానెగయించి
ముచ్చట్లు చెప్పుచో ♦ మురియుటెపుడో,
కావుకావున నేడ్వ ♦ గాసెత్తరవడ
వేడుకతో జోల ♦ పాడుటెపుడో,

తే. గీ. కటకటా! యౌవనంబెల్లఁ ♦ గడచిపోయె
కోర్కెలెల్లను లోలోనఁ ♦ గ్రుంగుటయ్యె
బిడ్డ తల్లిని కాలేని ♦ గొడ్డురాల
నెటులసైరింతు నీబాధ ♦ నేమిసేతు? 2

[దేవదూత ప్రవేశం]

2 కీర్తన:

శుభము లొనఁగూర్చితి ॥శుభ॥
అభవుని దీవెన - ప్రభవమొందగ ॥శుభ॥
దేవదేవుని - దివ్యమహిమను
స్థిరముగ నమ్ముము - వీరమాతవు ॥శుభ॥

కల్యాణీ! శుభము. శుభము. నీప్రార్థన దేవుని చెవికెక్కినది. కొలఁది కాలముననే పరాక్రమోపేతుఁడగు పుత్రరత్నమును బడయుగలవు. నీవు యీనాటినుండి నియమబద్ధవై యుండవలెను. ఎట్లనిన.

తే. గీ. మద్యసీసాయములనైన ♦ మత్తునిచ్చు
ద్రాక్షరసమును నేనియు ♦ తాకరాదు
ఆరగింపకు మపవిత్ర ♦ మైనదాని
వ్రీసవమొందిడిదాక స ♦ ద్భక్తితోడ. 8

మనో:—దేవా! నేడుకదా, నాజన్మ పావనమైనది.

దూత:—ఓ అబలా! నీకు జన్మింపనున్న బిడ్డ అత్యద్భుత చరిత్రను వెలయింపగలడు. దేవుని యాశీర్వచనమును పొంది, యిశ్రాయేలీయులను ఫిలిస్తీయుల చేతినుండి రక్షింపగలడు. ఏమరక యీమాట వినుము పుట్టిన దాది అతని తలపై మంగలకత్తి పడరాదు. అట్లుపడిన, తన ప్రభావమును గోల్పోవును.

8 కీర్తన: చాయు: భజనమేరా - రాం.

యెహోవ దేవ - దే—వ—॥యె॥
సదమలమానస - సాధుశరణ్యా।
స్వాశ్రితరక్షణ - చతురవిహార।
నన్నుతిఁజేసెద - గా—వ—రా—వ ॥యె॥
పతిత పావన - పరమోద్ధరణా।
అంతకు, మూలము - నీవెకావ।
భక్తలోక పరి - పాలదేవ ॥యె॥

(దూత నిష్క్రమణ. మానోహప్రవేశం)

మానో:—ప్రాణేశ్వరీ! అలౌకిక జిజ్ఞాసాయత్తవై యుంటివేమి? నేడు నిన్ను చూడ నాకే యాశ్చర్యమగుచున్నది. యెహోవ దివ్యమహిమ నేడు నీయందు ఆవిష్కరణము కానోపు. దేవీ! మొగమెత్తి యిటుచూడుము,

మనో:—నాథా! ఈనాడు చిరంతనమైన మన యాకాంక్ష ఫలించినది. నేను యెహోవపేరట ప్రార్థన చేయుచుండ,

తే. గీ. దివ్యకాంతిని విరజిమ్ము • దేవమాత
యెట్టయెదుటను కనుపించి • యింకముందు
ప్రభవ మొందును సత్పుత్రి • రత్నమొకఁడు
మనకు నగచని వచియించి • మరలిపోయె 4

మానో:—ఏమేమీ! దేవమాత సాక్షాత్కరించెనా? సత్పుత్రుని మనము పడయనోచెదమా? ఎంతధన్యులము. ప్రియసీ! సాక్షాత్కరించిన దేవమాతయింకేమియును చెప్పియుండ లేదా?

మనో:—చెప్ప కేమి? పుత్రుని ప్రసవించుదాఁక అపవిత్రమైన వస్తువులు నేను తాకరాదనియు, ద్రాక్షాసవాది నింద్యమైన పానీయములు సేవించరాదనియు, బిడ్డపుట్టినదాది యతని తలపై మంగలకత్తి పడకాదనియు చెప్పెను.

మానో:—భాగ్యవతీ! మనమెంతయు ధన్యులము. నీవు చనుము. నాహృదయము కృతజ్ఞతా భరితమై దైవప్రార్థన చెల్లింప నిశ్చయించినది.

(మనోరమ నిష్క్రమించును. మానోహా దైవ ప్రార్థనచేయుట)

4 కీర్తన: రాగం - శంకరాభరణము. తాళము: ఆది
పరమాత్మా నీదు మహిమ—కనుఁగొనఁ నిలఁ నెవరితరము ।ప॥
(సాకీన్) నినువిన - గతిగాన - ఈజగాన ।
ఇటుకానరావె - బిరాన॥ కనుఁగొనఁ నిలఁ నెవరితరము ।ప।

ఓదయామయా! నేటికి ధన్యులమైతిమి. నీవు తలఁచిన కార్యము కాకపోవునా? హే! పరమేశ్వరా!

సీ. లోకంబులెల్ల సు • శ్రీకంబులుగఁ జేయు
సామర్థ్యమున్ గల • స్వామి నీవ,
అఖిల జీవులకు నా • హారంబుఁ గల్పించి
దయతోడఁ బాలించు • దాతనీవ,

భక్తజనావళి • పాపముల్ దూలించి
వేగరక్షించెదు • వేల్పువీవ,
ఆదిమధ్యాంతము • లరయకానఁగ రాక
మూలమై వెలిగెదు • మూర్తివీవ,

తే. గీ. నీవ ప్రభావంబ చింత్యంబు • నిస్తులంబు
వర్ణనము సేయ నేనెంత • వాఁడ దేవ
ఆశ్రయించెద నిన్ను నే • నహరహంబు
కాయకను చేతునీ సేవ • యోయొమహాత్మ. 5

ప్రభూ! నీకెంతయు కృతజ్ఞుఁడను అమేయుండవగు నీకు అల్పుండనగు నేనేమిచ్చి ఋణవిముక్తుండ నయ్యెదను. శూరుఁడగు సత్పుత్రునిఁ బడయునట్లు వరమొసంగితివి. నీకగ్రణంబుగ మేకనంజును కాన్క వెట్టెదగాక! చిత్తగించుము. హే! దయాపరా!

5 కీర్తన: రాగం: హిం. తోడి తాళము. ఆది.

బ్రతుకే మధురముఁ జేసితిగా - నా ||బ్రతుకే||
ధన్యజీవినే నైతిని దేవ ||బ్రతు||
కన్నుల విందుగ • కనఁబోదునుగ ,
కన్నకొడుకును - కరుణాభరణ |బ్రతు|
కోరిన కోరిక | నేటికి తీరెను |
నాదగు భాగ్యము - పండెను దేవ |
నీసుధారసము - నింపుము దేవ |
దీనుల పాలిట - దిక్కిక నీవె |బ్రతు|

(యవనిక వ్రాలును)

## రెంగవరంగము

[మానోహ మనోరమల ప్రవేశం]

మనో:— నాథా! మన సంసోను చాలదుడుకు వాఁడైనాఁడు. లేకలేక మనకీ వృద్ధాప్యమున కలిగిన బిడ్డ పూతచరిత్రుఁడైన మన మెంతయు ధన్యులము.

మానో:— ప్రేయసీ! కాదని యెవరనఁగలరు, దినదినము పిల్ల వానిపై వచ్చు పితూరీలు మనస్తాపమునకు కారణమగు చున్నవి, సంసోనును పిలువనంపి, బుజ్జగించి హితవు నుపదేశింపరాదా?

మనో:— ఆటలరంధిని పడిపిల్లవాఁడింటికే చేరకున్నాఁడు (తెరలో నుండి సంసోను వచ్చుచుండును) అదుఁగో! మన సంసోనే వచ్చుచున్నాఁడు, (ప్రకాశముగా) కుమారా! సంసోనూ! (అని పిలువ బాలసంసోను ప్రవేశించి)

బాలసంసోను:— తల్లి దండ్రులారా! వందనములు

మానో:— మాతపః ఫలమవని, కులవర్ధనుఁడవని నీపైగంపెఁడాశతో నున్న మమ్ము యిట్లేల నిరుత్సాహపఱచెదవు? లేచినది మొదలు నీపై యెన్నికొండెములు వినవచ్చుచున్నవి. నీకు చెప్పి చెప్పి ప్రాణము విసుగుచున్నది. ఇఁకనైన బుద్ధిమంతుఁడవుకావా?

మనో:— నాగారాబుపట్టీ! వరాలమూటా! మనకేలరా యీ యప ఖ్యాతి?

ఉ. అల్లరిసేయకయ్యా, మరి ♦ యాడగనుండుట నేర్వుమయ్యా, నీ
వెల్లెడ మంచివాఁడవయి ♦ యెన్నికగాంచఁగదయ్యా, దేవునిన్
ఉల్లములోనఁ జేర్చుకొని ♦ యుజ్వలకీర్తి వికసింపవయ్యా, నీ
వల్లన యిశ్రయేలులను ♦ వంగడ మంతకు వాసిరావలెన్. 6

సంసో:—శా. అమ్మా! అల్లరిసేయనే? జెనుగునే? ♦ ఆర్యుల్ నన్నుఁ
మెచ్చరే?
మనో:- సమ్మానమ్మును పొంది వంశమునకున్ ♦ సత్కీర్తి
తేవన్నా
సంసో:- నేనమ్మా యాశీల ఫిలిస్తు వంశజుల వ ♦ హ్యావట్టి
పోకార్చెదన్,
మనో:- మమ్ముఁ వృద్ధుల నెట్లునోమెదవో, అన్నా! వంశ
సంవర్ధనా! 7

కుమారా! అతిలోక దివ్యమహిమా సమన్వితమైనది నీజననము. నీవు గర్భస్థుఁడవుగాక మునుపు దేవదూత నాకు సాక్షాత్కరించి నిన్ను గుఱించి నాతో కొన్నిమాటలను నుడివెను. అవేవన:-

తే. గీ: కదనరంగాన నుఱవడిఁ ♦ నదిరితోడ
పోరునప్పుడైన పోదు నీ ♦ భూరిబలము,
గొఱిగినంతనె నీతల ♦ క్షురికచేత
బలము సర్వంబుఁ వ్యయమౌను ♦ భద్రమయ్య 8

మానో:—నాయనా! వింటివికదా నీతల్లి మాటలు. మంగలకత్తి నెన్నడును నీతలపైకి చేరనీయకుము. యావజ్జీవిత మీదీక్ష వదలక జాగరూకుఁడవై మెలంగుము, (మానోహామరనోమల నిష్క్రమణ)

సంసో:—(స్వగతము] ఓహో! నేను దైవిక జన్ముఁడనఁట. ఫిలిస్త్రీయులనుండి యిశ్రాయేలీయుల పారతంత్ర్యమును పోగొట్టుట కవతరించితినఁట. (కోపోద్రేకుఁడై] ఓరోరీ! ఫిలిస్త్రీయులారా! మాస్వాతంత్ర్యమున పహరించితిరా?

చ. మెలవున నాక్రమించి బలి♦మిఁ మముఁ నందఱఁ బట్టి దాస్యశృం
ఖలలనిబద్ధుఁ జేసి కడు ♦ గర్వమునన్ కనుఁగాన లేని దు

ష్టుల మిము నేఁడె చంపెదను ♦ శూరుఁడనయ్యెద, పారతంత్ర్యశృం
ఖలలను ద్రెంచెదన్. కడు సుఖంబున మించెద, కీర్తిఁ గాంచెదన్ 9
ఓరీ! ఫిలిస్తీ యోధములారా!

ఉ. మాయెడఁ నాదినుండియును ♦ మత్సరముల్ వహించునా ఫిలి
స్తీయుల రూపుమాపకెటు ♦ తీరదు నా పరితాపమిప్పుడే
నాయధమాధముల్ తులువ ♦ లందరఁ బట్టి ఖరాసిచేతనే
కోయుదు వారి గొంతులను ♦ కుయ్యిడ వారల దారలిండ్లలో 10

(ఫిలిస్తీయ పౌరులటు వచ్చుచుండ వారిని చూచి)

ఓరీ! ఫిలిస్తీయులారా! నాకారిఁబడితిరి. మీరెక్కడకు పోఁగలరు? ఇప్పుడే హతమార్చెద. నిలుడు. నిలుడు.

6 కీర్తన. రాగం: మోహన—తాళం: అది,

దవాగ్ని కీలల ♦ దహింపఁబడు శల
భవారమను మీ - స్వరూపముల్
భువిన్ గలుపుదున్ - నివారించు వాఁ
డెవాఁడు గలఁడీ - వసుంధరన్ |దవా|
మదావళంబున - కెదుర్కొనెడు చీ
మదండు గతియా ♦ గదా మీ బ్రతుకు
యిదే మిమ్ము సద - మదంబుఁ జేసెద
మదంబుచే నను - కనంగనైతిరి |దవా|

పౌరులు:—నంసోను బాబూ! మేము నీవగవాళ్ళము కాము,

7 కీర్తన.

బాబు మాజోలికి రాకు ♦ నంసోను బాబుగారు |బాబు|
ఫిలిస్తీయులము కాము - ఇశ్రాయేలీయులము |బాబు|
1. నీసహవాసము చేయ - నిచ్చగించు మనుంటిమి |
మాతో వైరము యేల - మన మంతా యొకటేగా |బాబు|

సంసో:—[నవ్వుచు, పౌరుల భుజములపై దట్టుచు] సోదరులారా! క్షమించుడి. మీరే ఫిలిస్తీయులనుకొంటిని; నొచ్చుకొనకుడు.

1వ పౌరు:—బాబూ! మేము ఫిలిస్తీయులమైనచో మమ్ము చంపు వాడవేనా?

సంసో:—ఔను. ముమ్మాటికిని.

2 పౌరు:—ప్రభువులగు ఫిలిస్తీయులపై తిరుగంబడిన ప్రమాదము రాదా?

సంసో:—పిరికిపందలారా! అజ్ఞానమున మీరింకను మునిగియున్నారు. మూర్ఖులును నాస్తికులును అగు ఆఫిలిస్తీయులు, యిశ్రాయేలీయుల నేలుట యెంత తలవంపు? ఇకనైన కండ్లు తెరచి నడుముకట్టుడు. పోరాటమునకు సిద్ధముకండు. దాస్యమును మట్టుపెట్టుడు.

8 కీర్తన: చాతు: ప్రభుయేసు మహాతిప్రీతు:

జయలీలగా వినోదమందగా - జయమేంబడసెదను నాహా ।జ।
నావిశేషమా - పరాక్రమంబు - తెలియంజేతునెవ్వడైన ।
వైరివిదళన విహారవినోదమె - ముదముగొలుపుగద నాహా ।జ।

(బాలసంసోను కీర్తన పాడుకొంటూ నిష్క్రమించును)

1 పౌరు:—ఒరేయ్! మన సంసోనుబాబు చూస్తుండగనే యెంత దొడ్డోడయ్యాడురా?

2 పౌరు:—దొడ్డోడుగా కేం? దేవుని వరానపుట్టేడు. మనవంశాని వృద్ధి రించుతాడ్రా?

1 పౌరు:—పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది, ఎంత యేడ్పించుతున్నారుగా ఆఫిలిస్తీయులు?

2 పౌరు:—వారికి వినాశనకాల మాసన్నమైనదిలే. వారి అంతుకనుకోకుండే నిద్రపోడు. యిగ మన సంసోను, తప్పక పగ దీర్చుకొంటాడు. ఇశ్రాయేలీయులకు నాయకుడౌతాడు కూడాను.

1 పౌరు:—సంసోను, సంసోను కాదురా! శూరసంసోను.

9 కీర్తన: జయగీతి

జై జై జై । శూరసంసోనుకు । జై జై జై । జై జై జై ॥జై॥
జయగీతములను । జయజయధ్వనులతో ।
జయశాలికి మేం । పాడెదము ॥జై జై జై॥

(తెరవాలును)

శ్రీ జగద్రక్షకాయనమః

# శూరసంసోను



## ద్వితీయాంకము

### మొదటిరంగము.

(తిమ్నాతు పట్టణ సమీపమునందలి ఉద్యానవనము. సంసోను ప్రవేశము)

పెద్ద సంసోను:—[మెల్లగా నడచుచు] తిమ్నాతు పట్టణమును సమీపించితిని. పట్టణ బహిరంగమునందలి యీవనమంతయు మనోహరముగనున్నది. సూర్యాతపము తీక్ష్ణముగనున్నది. గమనాయాసము పోవనించుక విశ్రమించి తిమ్నాతుకు పోయెదగాక (విశ్రమించును)

సరోజ ప్రవేశం కీర్తన 10 వనవర్ణన, మాండ్ రాగము-ఆది.

ఆహా! ఈతరుగుల్మ లతాదులు - అందము చిందెడుగా ।
కనుంగొనరే - అందము చిందెడుగా ।ఆహా।

చల్లనినీడల సరసనుజేరి - నేడఁదీరనే సేవించెదను ।
చిగురుగములు తిని - పొగరున కోకిల ।
కూహూకోకోయని పలుక ।ఆహా।
వరుగున పోయి కననగు నాహా ।
ఆపోదమాటున - వదలనితమితో ।
మెలఁగెడు నొకపిక - ములజంట ।
కలకల నాదం బొనరింపఁగ ।ఆహా।
[సాకీ] హే! వినమిత, వినుత, రసాల తరుజాల ।
పరిమళ, మిళిత, కుసుమసుధామయలోల ।
హే! సురభిసుమనోజ్ఞ, వికసిత వల్లరీజాల ।
ఇందలి హాయిని కెందును లేదు ।
వనము చెట్టము రంజిలఁజేసె ।
కోవెల "కో" యని కూయుచు ।అహా।

సంసా:—(నిద్రనుండి లేచి తనలో) ఎక్కడ దీగాంధర్వధ్వని? తేనె సోనల కన్నతిశయ్యమై హృదయమున హ్లాదమొనఁగూర్చు చున్నది (సరోజవైపు చూచి) అదిగో! ఆ లేతమావిగున్న నల్లుకొనిన మాధవీ పొదమాటున విహరించు యాచేడియదే కాఁబోలు యీగాన నిస్వనము.

చ. సురభిసమగ్రమైదనరు ♦ సోపుఁ దోమిన మోమునందు సుం
దరమగు వెన్నెలందె గదు ♦ తళ్కుల పొదరులద్ది, వ్రిక్కగా
విరచితమైన పాపటయు ♦ వీనులలోలకు లొప్పుచుండ, నా
గరికల మిన్న చెన్నుఁగన ♦ కన్నుల పండువుచయ్యె నెంతయుఁ 11
అహా! ఏమీ ఆసోయగము!

మ. అరరే! సోగమెఱుంగు కన్నుగవతీర ♦ య్యారె! కెమ్మోము సౌ
రరరే! క్రొన్నెల నెన్ను నెన్నుదురు పెంప ♦ య్యారె! కెమ్మోవిసొం
పరరే! కాంచనమున్ హసించు మెయిడా ♦ లారేమ యిల్లాలుగా
వరియింపన్ గలవాఁడె ధన్యతముఁడా ♦ భాగ్యంబు సామాన్యమే 12
ఆజవ్వని యెవ్వతియో తెలిసికొని వచ్చెదగాక (సమీపించి)

ఉ. ఎవ్వరిదాన వీవిపుడు • యెవ్వని ధన్యుని జేయ నెంచితో,
జవ్వనపు ధనం బొసఁగి • సంతసమున్ ఘటియింప నెయ్యెడన్
యెవ్వఁడు నీదయారసస • మృద్ధికి పాత్రుఁడొ, నీయుదంత మో,
జవ్వని! కర్ణముల్ దనియ • సర్వముఁ దెల్పుము సత్వరంబుగన్ 13

ఓలావణ్యవతీ! వీపవిత్రనామాక్షరము లెయ్యవి? నీతలిదండ్రు లెవ్వరు? నీధన్యవృత్తమును నేను వినఁదగుదునా?

సరో:—జగన్మోహనుఁడవగు నీవు యేకాంతవాసినగు కాంతల పరిచయమునకై వచ్చిన నీవెవ్వరవో ముందు నాకు తెలియవలదా? బంగారము వంటి నీశరీరచ్ఛాయ గమనాయాసమున కసుగందినది. సుకుమారుఁడవగు నీవిచ్చోట నాసీనుఁడవగుము

సంసో:—మోహనాంగీ! నీమాటలు సుధామయములై హృదయంగమగుచున్నవి,

సరో:—ఒంటరిగ నున్న స్త్రీలను పలుకరించు పద్ధతియాయిది?

సంసో:—నీవృత్తాంతమును తెలుపక వలపించి ఊరించుచుంటివా?

సరో:—అవివాహితయైన స్త్రీకి సన్నిహితులగుటకు మగవారెంతకైనను స్వతంత్రులు.

సంసో:— నేనును అవివాహితుఁడ ... ఆ లేత మావిగున్నను, మాధవీలత యెట్లలముకొన్నదియో చూడుము.

సరో:—(సిగ్గుతో) ఔను. మాధవీలతవలె స్త్రీ, పురుషు నాశ్రయించును.

సంసో:—మనోహారిణీ! పరస్పరాశ్రయమునకు పోలిక నివ్వరాదా? అయిన, నీతల్లిదండ్రు లెవ్వరు?

సరో:—తిమ్నాతు పట్టణవాసియగు ఫిలిస్తీయుని కొమరికను. నా పేరు సరోజ.

సంసో:—అయ్యో! ... ... (ఆలోచించుచుండును.)

సరో:—ఏమీ! ఆలోచించుచున్నారు?

సంసోను:—ఆలోచించవలసియే వచ్చినది. నేను యిశ్రాయేలీయుఁడను. పేరు సంసోను.

సరో:—అయ్యో! ఇశ్రాయేలీయుఁడవా? విరోధివంశజుఁడవు గాన యెట్లు సాధ్యమగును? దైవవిధి యెటులున్న నటుల జరుగక మానదు.

సంసో:—తరుణీమణీ! అటుచూతుము. ఆనూమిడియు మాధవియు నాకే తెగకుఁ జెందినవియా? పరిష్వంగ సుఖమునఁదేలు వాని ప్రేమానుబంధమును చూతుము?

సరో:—నేనస్వతంత్రను నాతల్లిదండ్రుల యిష్టము కావలెనుగదా. పోయివచ్చెద.

[తెరవ్రాలును]

## రెండవరంగము

(సరోజ శయనాగారము)

సరో:—(స్వగతము) కటకటా! లోకమున నెంతగాలించినను, నా తండ్రి నాకనుకూలుఁడైన వరుని సంపాదించ లేకపోయెను. సకల లక్షణ సంపన్నుఁడును, సర్వాంగ సుందరుఁడు అగు, అనుకూలుఁడైన ప్రియుని యీనాఁడు పొందఁగల ననుకొనిన చో దైవము నాకన్యాయముఁ జేసె గదా... ...నాప్రియుఁడు ఫిలిస్తీయుఁడై జన్మింపఁగూడదా? ఇశ్రాయేలీయునిపైననే నా యనురాగము నిబద్ధమయ్యెను. ఇతనను మాదాంపత్య మెట్లును సంఘటితమగు విధము కన్పించదు విద్వేషులగు యిశ్రాయేలీయు ఫిలిస్తీయు వంశములు పరస్పర సౌహార్దమునఁ గలయుట సంభవము. నాతల్లిదండ్రులను ఒప్పించుటయు దుర్లభము. ఒకవేళ నాయందలి ప్రేమాతిశయమున నావా రంగీకరించినను ఉభయవంశములు పోరవులు మాని యెట్లు

కలియఁగలవు? ఎందుకీయుడియాస? నాప్రియునకు లగ్నమైన హృదయము నెట్లు మరల్పుకొందును? నావిఫలయత్నమును, స్మరించుకొని యెంత పరువనంచినను ప్రియునిపైఁగల యాశ అనురాగము విస్మరింప సాధ్యముగాకున్నది.

ప్రభూ! ఘటనాఘటనా సమర్థుండవగు నీవే శరణ్యుఁడవు. నన్నావరించిన యీనిరాశయను చీకటికి వెలుఁగువై దారిఁ జూపెదవో? లేక అంధకారమను సముద్రమున ముంచివైచెదవో? సర్వము నీదేభారము. (అని సరోజపాన్పుపై పరుండును. సౌగంధిక ప్రవేశం)

సౌగం:—తల్లీ! తల్లీ! సరోజ! (అని లేవగా సరోజ లేచికూర్చుండును)

సౌగం:—తల్లీ! ఎప్పుడును శయనాగారమును వీడక యేకాంతముగ పరధ్యానమున కాలము గడపుచుంటివి. యుక్తవయస్సు వచ్చినదాది, నేనును నీతండ్రియును తహతహలాడు చుంటిమి. మన బంధువులు చెప్పిన సంబంధములం దొక్కటియు నీకా కర్షణీయముగ లేదు. మఱి నీహృదయనాథుడెవ్వరోకదా?

చ. ముదువవు క్రొవ్విరుల్ తలను, ♦ ముచ్చటలాడవు అన్నమేమియుఁ గుడువవు, నీరముఁ గొనవు ♦ కూరిమిమీరఁగనాటలాడఁగా గడగవు బోటులఁ గలసి, ♦ కల్కిరో! నీదు మొగంబుఁజూడఁగా నెడదవిచారమేదొ్ాజని ♦ యించిన చందముఁ దోచె నీమొదఁ 14

అమ్మా! నీమనస్తాపమేదియో నేనెఱుఁగఁదగదా?

సరో:—నాకట్టి మనస్తాపమును లేదు.

సౌగం:— లేదనిన సరిపోవునా? దిఱునవ్వు వెన్నెలలతో యింటిని వెల్ల వేయు నీముఖేందు బింబము విషాద మేఘావృతమైనది. నీతలఁ పులోని చిక్కులెయ్యవియో నాకెఱుకపరచుము.

సరో:—తల్లీ! మనపట్టణ సమీపమునందలి ఉద్యానవనము నందొక నాడు నేను విహరించుచుండ, అసామాన్య పరాక్రమ తేజో విరాజితుఁడును, బాహుబల సమగ్రుఁడును, స్ఫురద్రూపి యును, అవివాహితుఁడును అగు ఒకానొక యువకుఁడు నాకం టఁబడెను. చూచిన దాది నాహృదయమతని యందేలగ్న మయ్యెను.

సాగం:—అయిన, మన మెంతయు ధన్యుల మేకదా!

సరో:—కాదుతల్లీ - ఆయువకుఁడు జొర్యాని వాసియగు మానోహ కుమారుఁడు, పేరు సంసోను. ఇశ్రాయేలీయుఁడట.

సాగం:—ఇశ్రాయేలీయుఁడా? అయిన, అందని వఁడ్లకు అఱ్ఱుల చాచెదవు?

సరో:—అందకేమి? అతనిష్టమే.

సాగం:—ఇశ్రాయేలీయుఁడుకదా!

సరో:—అందుచే నేనీ పరితాపమునఁ బడి మసికుచు నిశ్చయించితిని. నీతో చెప్పలేక పోవుచుంటిని.

సాగం.—

శా. మాయమ్మా! చెవిఁజేర్చు నాపలుకు ని ♦ మ్మాడ్కిన్ దలంపేల, యి
శ్రాయేలీయులు కానిసల్ మనకు త ♦ త్సంబంధబాంధవ్యముల్
హేయంబౌ, మన సంఘమందొకని నీ ♦ యిష్టాను సారంబు, వా
లాయం బేర్పడఁ బెండ్లిగాదగును చె♦ల్వా! బంధుసమ్మాన్యతన్ 15

సరో:—అనురక్తుల ప్రణయశుద్ధి నెఱుంగక అంతఃకరణము అణగ ద్రొక్కుకొనుమని యెదవు. తల్లీ! అదెట్లు సాధ్యము?

ఉ. ప్రేమరసప్రవాహమున ♦ పిచ్చకలై తనరారు కోర్కెల
మ్మా! మితిమీరఁ బారెనిక ♦ మానసగంజాలను వాని పొందు నా
కామితమున్ ఘటింపుమటు ♦ గాని యెడన్ మదనాగ్నికీలలన్.
వేమరు మ్రగ్గుదాన నిను ♦ వేడెద దాపగనేల తెల్పితిన్. 16

సాగం:—తల్లీ! నీనిశ్చయమట్లైన నీతండ్రితో జెప్పి ఒప్పించెదను.
(యవనిక వ్రాలును.)

మూఁడవరంగము

(సంపోను మానోహమనోరమలు ఆసీనులైయుందురు.)

మానో:—కుమారా! తిమ్మాతు పట్టణము వెళ్లినదాది నీవు పరాధీన చేతస్కుఁడవై జెగగొనిన వానివలె కన్పడుచున్నావు. తొల్లిఁటివలె మనస్సువిప్పి మాటలాడవు. కలకలలాడవు. కారణమూహింపకుంటిమి.

మనో:—ఔను. ఆహార విహారముల యందును యెంతో వ్యత్యాసము కలదు. కుమారుఁడు క్రమముగ చిక్కిపోవుచున్నాడు.

మానో:—నాయనా! నీవిట్లులుంకుటకు కారణమేమి?

సంపో:—తండ్రీ! తిమ్మాతు పట్టణనమీపమునందలి ఉద్యానవనమున నిలిస్త్రీయుల యువతిని చూచితిని. అ త్తలోదరి నాహృదయము దొంగిలించినది ఈవిషయము మీతో చెప్పుటకు వెరచు చుంటిని.

మానో:—

శా. వరాతండ్రి! విరోధికన్యకనునీ ♦ వేరీతి వాంఛించెదో?
క్రూరుల్ ద్వేషు ఋ గర్వదర్పితమతుల్ ♦ క్షుద్రస్వభావోన్నతుల్
కారేవారలు; వారికిఁ మనపునై ♦ క్యంబెట్లు సంధిల్లునో
లేరే చక్కని కన్యకల్ మనలొ ఆ ♦ లీలావతిఁ బోలరే! 17

సంపో:— తండ్రీ!

తే. గీ, మృదువులైనట్టి తీగెలు ♦ రెండుఁగలసి
అల్లుకొనునట్లు; నాహృద ♦ యంబుదాని
హృదయమును రెండు నేకమై ♦ యనసెఁగాన
యితర నేదియు మదినినే ♦ నిచ్ఛగింప, 18

మానో:—అటులనా! నీనిశ్చయము నేడే తిమ్నాతుకు ప్రయాణమగు
దము. సిద్ధముగ నుండుము, (సంసోను మానోహామనోరలును
తెరలోనికి వెళ్ళి మరల రెండవ ప్రక్కగా ప్రవేశింతురు)

సంసో:—తల్లిదండ్రులారా! అల్లదే తిమ్నాతు పట్టణము. ఈభయంక
రాటవిని దాటిన మన మాపట్టణము చేరఁగలము. మీరీ
చెట్టుసీడను విశ్రమింపుడు. నేనల్లంతదూరముస పోయి (వన్యఫల
ములను గొని వచ్చెదను (మానోహామనోరములు ఒకప్రైపున
విశ్రమింతురు సంసోను మరొక ప్రక్కకు వెళ్లుచుండును.
తెరలో సింహగర్జన) ఏమది! సింహగర్జనవలెనున్నది. అదిగో! నామీా
దకేవచ్చుచున్నది.

తే. గీ. ఓమృగేంద్రము! నామీాద ♦ నుఱికెదీవు
కండక్రొవ్వున; నివుడెసీ ♦ గండడంతు
చెండివేసెద నిను మహో ♦ ద్దండలీల
దైవబలమున విహరింతుఁ ♦ దలకఁబోను, 19

[తెరలోనికి పోయితిరిగి వచ్చి ఆయాసము నభినయించుచు]

ఆహా! దైవావేశ పరవశుఁడనై ఈసింహరాజమును మేకపూ
నను చీల్చు విధమున రెండుగా చీల్చిచెండాడితిని. (తల్లిదండ్రులను
సమీపించి] జననీ జనకులారా! లెండు. ఫలములను తెచ్చితిని.
భుజించి పయనము సాగింతము. (తెరపడును)

## నాలుగవ రంగము
## కళ్యాణమంటపము.

(సరోజాసంసోనులు, మానోహామనోరములు, సౌగంధికా
తిమ్నాతీయులు మఱికొందరు రుందురు.)

11 కీర్తన: [సరోజా సంసోనులు తప్ప అందఱు పాడవలెను)
జయజయజయ ♦ నవమోహన - సర్వలోక సుందరాంగ ॥జ॥
మాధుర్యవచో విలాస - సౌందర్య సరోజనాధ ।

మంగళనిద్ర — మూపాలక ॥జయ॥

(సత్యదూత లేచి వధూవరులకు రొంక దండనిచ్చి ఒకరిచే మరి యొకరికి వేయించును]

సత్యదూత:—నూత్నవధూవరులారా! శుభాశీస్సులు. పరస్పర ప్రేమావలోకిత ప్రణయపులకితులై మనియెదరుగాక! చిరాయురారోగ్యైశ్వర్య సత్సంతాన స్థితులఁజెలంగి మెలంగెదరు గాక!

కుమారా! సంతోషా! గార్హస్థ్య జీవితరంగము నందీవాడ నీవడుగు పెట్టితివి. నీయాశాలతలిందే ఫలింపవలెను. అల్లారుముద్దుగ తల్లిదండ్రుల మాటున నింతదనుక పెరిగి ఆత్మీయుఁడవు నీవేనని వచ్చిన యీతన్వంగిని నెట్లు సంరక్షించుకొని మెదవో కదా!

ఉ. చూడఁగదన్న జీవనపు ♦ శోభన నందన సర్వసీమలో
నేఁడు మొదల్త దీయమగు ♦ నేయమెలర్పఁ నెసంద మేలంసుఁ
జోడిమిఁదీవెలై పెనఁగి ♦ పుష్పఫలంబుల నీను గావుతన్
పాడఁగదన్న సంసృతిని. ♦ బండిన నవ్వునఁ గూర్మిఁగీతికల్ 20

తే. గీ. దేహమందలి జీవమీ ♦ తీవబోఁడి
సర్వజీవన చైతన్య ♦ సరణి యీమె
వంశమణివృద్ధి మూలమీ ♦ వారిజాక్షి
కాన, నీమెను నీవట్లు ♦ గారవింతో 21

కుమారీ! సరోజ,

ఉ. అరయభర్త సద్గతుల ♦ కన్నిటికిఁ మొదలౌగదమ్మ సం
సారప్రమేయ ప్రేమరుచి ♦ సర్వము నాథునికీగదమ్మ, స
ద్గారవజీవనంబు నద ♦ గాంచి మసంగదవమ్మ? సత్కృపా
సారముఁ జిల్కరించెడి ♦ సాహస బీదల నెల్లనమ్మరో. 22

దంపతులారా!

తే. గీ. కోరమందున గుచ్చిన ♦ దారమట్లు
పాలఁగలసిన నీరంబు ♦ వగిదిదోఁప

జతీంద్రుహా త్రిన కట్టుల ♦ జతివ పొరిగి
సఖ్యభావన జీవన ♦ సరణిమనుడు. 23

సభాసదులారా! దాంపత్య ధర్మమెంత ప్రశంసార్హము.

తే. గీ. తతిగి పోకండ మధుపాత్రి ♦ దాల్చు తరుణి
తాగిమధువుల కొసరును ♦ తరుణుడెపుడు
నిత్యమున్ క్రొత్తసొబగులె ♦ నిత్యముగ వ
సంతఋతువె, దంపతుల సం ♦ సార మహహా! 24

ఈదంపతుల సమైక్యత వలన యిశ్రాయేలీయ ఫిలిస్తీయ వంశములుద్ధరింపఁబడినవి. పరస్పర విద్వేషములను విస్మరించి సఖ్యభావమున సమకూడిరి. ఇరుగు పొరుగున జీవించు నీరెండు తెగలకును శాంతి భద్రత లొనఁగూడినవి. ఇట్టి వివాహములే పెక్కు జరిగి కళ్యాణ పరంపరలు కురియుఁగాక!

(12 కీర్తన: కమానరాగం - ఆదితాళం. (అందరు పాడవలెను.]

మంగళం - మంగళం - మనసరోజ సంసోనులకు |జయమంగళం|
ముగ్ధమోహన - విలసన మొప్ప - ప్రణయసుధలను పెరిపింపగను
ప్రణయబంధము ♦ దృఢముగ బిగియగ |
మంగళ - మాలిక - లోలన - హారతి | మంగళం |
జయమంగళం | శుభమంగళం|

(పైపాట పాడుచుండగ తెరవ్రాలును. సరోజా సంసోనులు (కీర్తన పాడుకొంటూ చెట్టాపట్టీలతో ప్రవేశం]

18 డైలాగ్ కీర్తన : మాండ్ రాగము : ఆదితాళము

ఇద్దరు:—ఆనంద మయమేగా - జీవనమంతా |ఆనంద|
సంసో:— కాలమంతా - గడుపుదామా|
ప్రేమబంధము - బిగియఁజేసి|

సరో:—రాగలతలు పూలుపూయ - దండలు గుచ్చితాల్చుదాము
ఇద్దరు:—ఆనందమే - ఆనందమే - ఆనందమయమేగా॥

[చెరియొక పాదమును పాడదగిన డైలాగ్ పద్యము]

చం. అలిమరలేని కూరిమిని ♦ హాయిచెలంగ మెలంగు చుందమా
దరులారయక ప్రవించుచును ♦ శారసవాహిని తేలిపోదమా
కరమను రాగవల్లి నిటు ♦ కల్పవంజేయుచు పెంచుచుందమా
సరసపు జేరి నిర్భరము ♦ సాగిలి పోదము శోదు సీడగ 25

(చెట్టాపట్టీలతో నిష్క్రమింతురు, పౌరుల ప్రవేశం)

14 కీర్తన.

ఎంత ఆయాసముగ - నున్నదిరా మనకు
ఎంత ఆనందముగ - నున్నదిరా బాబు ।ఎంత।
పంసోను పెండ్లికి - ఏడు రోజులు విందు ।
వహాద్రిదుజూచిన - వప్పు వరమాణ్ణంబె ।ఎంత।
నేతిగారెలతో - మన మారగించుదాం
నేతికూరలతో - మనమారగించుదాం ।
పప్పుపచ్చళ్లను - మనమారగించుదాం ।
గారె బూరెలను మనసారగను తిని ।
సరోజ పంసోనులకు - జయజయని పాడుదాం ।ఎంత।

1 పౌరు:—అబ్బబ్బ! ఏమి పెండ్లిరా బాబు

2 పౌరు:—ఎన్ని పెండ్లిండ్లో చూశాముగాని యింత వైభవంగా యెక్కడైనా జరిగిందా! ఏమి పిండివంటలు! ఏమికూరలు! పొట్టలో ఖాళీ లేదు కానీ యింకాతినాలని వుంది.

1 పౌ:—ఓరి పప్పు ధప్పళం. ధర్మపిండం దొరికితేసరి. ఊపిరాడ కుండా యెక్కించుతావ్; కూర్చోరా కూర్చో (కూర్చొన లేక పోవును]

2 పా:—పొట్టవంగవద్దురా. అబ్బా! ఆయాసం వేస్తూంది. వరుసగా పోశారు నెయ్యి కిళ్ళు కాగుదామంటే కాలీలేదు పొట్ట ఉబ్బుతూంది.

1 పా:—ఓరి వెధవన్నరా! తేరతిండి దొరికిందని కడుపు మానం ఎరుగకుండా తింటే యేమౌతుంది?

2 పా:— ఏడ్చేవు లేవోయ్! నన్నంటావుగాని నీవేనా తక్కువ తిన్నది.

1 పా:—నిన్నన్నానుగాని నాకూ పొట్ట వంగడం లేదురా. ఏమిధప్పళం ఏమి అప్పడాలు ఏమిగారెలు ఏమిబొబ్బట్లు గుమ్మున వాసన కొట్టినాయి. కాలీలేదుగాని యింకొక్కటు వేద్దామనుకొన్నా

2 పా:— ఒరేయ్! లడ్డూలు మూటగట్టుకు రాకపోయావుగదా?

1 పా:—ఇంకా యేకరోజులుంటే యిప్పుడే యింత ఆయాసపడితే యేలా? "అజీర్ణం భోజనం విషం అన్నారు పెద్దలు" కాబట్టి అజీర్ణరోగం పుట్టకుండా చూచుకోవాలి, మనమెంత తిన్నా.

2 పా:—మీ పెద్దలట్లా అంటే, మా పెద్దలేమన్నారో చూచావా?

1 పా:—మీ పెద్దలొకరు మా పెద్దలొకరునా? పెద్దలంటే అందరికి పెద్దలే. అయినా యేమన్నారో చెప్పు మీ పెద్దలు,

2 పా:— ఏమన్నారా? ఓపిక చేస్తే ఒంటికి మంచిదన్నారు.

1 పా:—ఏడ్చేవ్! ఈవేళాకోళాలకేమిలే. పెండ్లికొడుకు తరఫున మనమెంతిన్నాముగాని పెండ్లికూతురు తరుపువాళ్లు మొంత మంది వచ్చారురా! వాళ్లతిండి వాళ్ళపాడైపోనూ పెద్దఅబోతు ల్లాలేవున్నారు. సర్దారులట వాళ్లదుంపతెగ వాళ్ళనుచూస్తే ఎనుబోతుల్లాలే వున్నారు. నిజంగా నాకు భయమేసింది. ఏనుగులాంటివాళ్లుగదా వాళ్ళు నేనక్కడ చూశలా వాళ్లాంటి ఎనుబోతుల్ని, నీలాంటి తిండిపోతుని.

2 పా:—వాళ్ళు యేసుగుత్తైతే యేంరా? మన సంసోను సింహాన్నిచ్చిల్లిం.
వాళ్ల విషయం మనకెందుకుగానీ మనవిషయం చూచుకొం
దాము. "పొట్టకి వెనుక భోజనానికి ముందు అన్నారు కాబట్టి
ముందుగా వెళ్దాము పద,

1 పా:—నిజమే. పద పోదాం,

(సంసోను తన తల్లిదండ్రులతో తిమ్నాతునుండి జొర్యాకు
ప్రయాణమగుట)

సంసో:—జననీ జనకులారా! మన మొక్క మజిలీవచ్చితిమి. మన
జొర్యా పట్టణము యింక చాలదూరమునకలదు. మీరిందు
విశ్రమించుడు నేనటుపోయి ఆహారమును వెదకి తెచ్చెదనుఁ
(మానోహామనోరమ లొకవైపున కూర్చుందురు. సంసోను
కొంతదూరము నడచి ఒకవైపు చూచుచు) ఓహో! నేను చం
పిన సింహరాజపు కళేబరమయ్యది దానిని సమీపించి చూచె
దగాక! (తెరలోనికి పోయి ఒక దొప్పలో తేనెను నింపుకొని
తాను తినుచు ప్రవేశం) నాచే హతమైన ఆసింహకళేబరము
నందే యెంతటి పెద్ద తేనెతుట్టె పట్టినది. దానిని దులిపి సంపా
దించిన యీ తేనె యెంత రుచిగా నున్నది. రుచిగానుండుట
యేకాదు: మాకందఫలమును పరివడు తిండియైనది. ఇదే నాతల్లి
దండ్రులకు సమర్పించెదగాక. (వారిని సమీపించి)

తే. గీ. అమృతంబును జేయుగా ♦ నన్నృతంబుఁ
ననఁగ నొప్పారు తేనెను ♦ తనివితీర
త్రాగవలయును హోతల్లి ♦ దండ్రులార!
హాయి సమకూర్చి కమన ప్రయాస మడఁచు 26

(తల్లిదండ్రులకు తేనె నిచ్చును. వారు త్రాగుదురు)

మానో:—కుమారా!

తే. గీ. ఎచట లభియించె తండ్రి! నీ ♦ కిట్టి మధువు?
యిక్షురసమును చక్కెర ♦ నీవశించు
రుచివిశేషంబు గలదిది ♦ రూఢిగాను
పోయిగల్గెను గమన ప్రయాస ముడిగె 27

హంసా:—తండ్రి! ఇది నాకు అదృష్టలోపునకు సమీపమునందలి
వనములో లభించినది. ఇంక మనము పోదమా?
(సాగిరెదరు. యవనికవ్రాలును)

---

శ్రీ జగదీశ్వరాయనమః

# శూరహంసము



## తృతీయాంకము

### మొదటిరంగము.

(సరోజహంసులు, తిమ్మానీయుడు, సౌగంధిక, సర్దారులుందురు)

హంసా:—బాంధవులారా!

ఉ. వందన మాచరించెదను ♦ భవ్యగుణాకరులార మీకు, నా
విందుకు మీరలందరును ♦ వేడుకతో దయచేసినారు, నా
యందలి స్నేహభావమున ♦ కంజలివెట్టెద మీకు స్వల్పమా
విందు వదింతలా పగిది ♦ వేడ్కను కేకొనరయ్య మన్ననన్. 28

1 సర్దా:—మీ స్నేహభావమున కెంతయు మేము కృతజ్ఞులము.

హంసా:—ఈవినోద సమయమునసే నొక వినోదమగు ప్రశ్న మీకు
వేయుదును. గడువు ఏడు దినములు మీ ఫిలిస్తీయ యువకుల
లో నే రేని యీకట్టుకథను విప్పఁగల్గినచో, ఎక్కుముగ మీకు.
మేధావులే,

2 సర్దా:—[ఉదిగ్నుడై] ఏమొఒకా? గడువేను దినములా? ఇశా్రీయేలీయులవలె పట్టి వాగాడంబరులుగారు ఫిలిస్తీయులు.

1 సర్దా:—వేయరాదా కధ! ఎందుకీ పేలకన?

సంసో:—నేను కధను వేసెదను. మీరు కధను విప్పలేక పోయినచో?

2 సర్దా:—పందె మొడ్డుము.

సంసో:— అటులనా? నాకధను మీరు విప్పలేక పోయినచో నాకు ముప్పదినార బట్టలను ముప్పది దుస్తుల పయ్యావలయును. మీరు విప్పినచో,అవి నేను యిచ్చెదను పందెమునకు మీరొప్పు కొంటిరా?

1 సర్దా:—ఆ. సమ్మతించితిమి ముమ్మాటికి.

సంసో:—అయిన,

తే. గీ మనలతినెడుదానికు బలమైన ♦ దానినుండి
తియ్యదనమునఁ జెనలేని ♦ తిండివచ్చె;
బలము గలదేది? తీపేది? ♦ పలుకవలయు
యేడు దినములు మాత్రికు ♦ గడువు మీకు 29

2 సర్దా:—ఈప్రశ్నకు తిల తోఁగయు కన్పించుట లేదు.

1 సర్దా:—ఈకధలో నిజముగ భావముండెనా? మనల సవమానించుటకా?

2 సర్దా:— గడువేదినములు కదా! ఆలోచించి చెప్పెదము. పోయి వత్తము (యవనివాలిలును. తిరిగి సర్దారుల ప్రవేశం]

1 సర్దా:—ఎంత యోచించిన కధ భావము గోచరమగుట లేదు. మనలో నొక్కరికిని తోచక పోయె. రేపటితో గడువు విండును.

2 సర్దా;—కధకు భావమే లేదు మనలను పరాభవించుటయే అతని సంకల్పము.

1 సర్దా:—భావము లేకపోయిన అతని కధను అతనైన విప్పి మనకు నచ్చ జెప్పవలయును గదా! కావున కధలో భావమొకలదు.

2 సర్దా:—అట్లైన నాకొక యుపాయము తోచుచున్నది. సంతోను భార్యవద్దకు పోయి ఆమెను బెదరించి యెట్లైన ఈకథభావ మును ఆమె తన భర్తవల్ల తెలిసికొని మనకు చెప్పునట్లు చేయుదము.

1 సర్దా:—నీవు చెప్పినది బాగున్నది. మనమిప్పుడే ఆమెను సమీపించుదము.

(సరోజ తన యింటి యందుండ సర్దారుల ప్రవేశం]

సరో:—ఫిలిస్త్రీయ సర్దారులా రా! మీరాకకు కారణమేమి? ఇటు కూర్చొనుడు.

2 సర్దా:—కూర్చుండుట కేమి? నీతో పెద్ద పనిగలిగి వచ్చితిమి.

సరో:...నావల్ల నేమి కాగలదు?

1 సర్దా:—నీవల్లనే కాగలదు.

2 సర్దా:—నీభర్త విందు సమయమున మాపైకథ వేయుటయు యేడు దినములలో మేము దానిని విప్పఁబూనుటయు, పందెము నిర్ణయించుకొనుటయు నీవెరిగినదియే కదా!

సరో:—ఔను. మీపైకథ వేసి పందులకు ప్రతిదినము నేను ఆందోళన పడుచుంటిని.

1 సర్దా రేపే కథను విప్పవలసిన దినము. కథభావము తెలియుట లేదు. ఫిలిస్త్రీయు లందరకును పరాభవము కలుగనున్నది.

2: సర్దా:—కాబట్టి నీభర్త నెటులైన మచ్చికచేసి యీరాత్రి ఆకథలోని రహస్యమును తెలిసికొనుము.

సరో:—అయ్యో! అదెట్లు సాధ్యము. ఆయన చాల గడుసరి నిబ్బర ముగలవాడు ఆయన వల్ల నేను తెలిసికొనలేను.

1 సర్దా:—తెలిసికొనలేక పోయిన కానిపక్షమున నిశ్రాయేలీయునకు మమ్ము పాదాక్రాంతుల మగుమనియెదవా?

2 సర్దా:—సరోజా! ఇన్ని మాటలేల? నీవు తెలిసికొనలేక పోయినచో, ఫిలిస్త్రీయుల పరాభవమునకు నీవే కనుక:—

తే, గీ. నిన్ను నీవారినందఱ ♦ నేడె చంపి
పరిభవాగ్నిని చల్లార్చి ♦ పగను దీర్చి
సఘు బంధించి నిను మేము ♦ నాధుఁజేసి
పట్టినింటికి చిచ్చేము ♦ పెట్టఁగలము 80

సరో:—(భయముతో) తెలిసికొనుటకై ప్రయత్నింౘెదను.

1 సర్దా:—ప్రయత్నించుట కాదు ప్రయత్నము నెరవేరదేని, నీకు ప్రమాదము తప్పదు.

2 సర్దా:—రేపే మరల వచ్చెదము. తెలిసికొన లేక పోయినచో, రానున్న ప్రమాదమును తెలిసికొనుము (సర్దారుల నిష్క్రమణ)

సరో:—(తనలో) హా! దైవమా! మొదటి నుండియును మాపై మాను బద్ధజీవనమున కాటంకము లేగదా! ఇశ్రయేలీయుని పెండ్లాడితిఁగి మాఫెరిస్తీయ వంశజులందరును మాపైకోర కోరలాడుచుండిరి. అగ్నికితోడు వాయువన్నట్లు నాప్రాణ నాధుండును పందెము చేసె. ఇఁక వారిద్వేషాగ్నియెట్లు చల్లా రును! ప్రాణనాధుఁడా శూరుఁడు. వారలను లక్ష్యపెట్టడు. నాకు కథను చెప్పడు. చూడఁజూడ, యిదంతయును వినాశనముపకే వచ్చినది... నాథుఁడు తన కథాంతమాస్యమును నాకు చెప్పినచో వారలకు వినిపింతును. తన పందెపు పాటవల నాపైకోపగించక మానడు. ఏమి కాగలదో!

గీ. నేను నావారి మేలును ♦ కనుదునేని
భర్తకు విరోధి నౌదును ♦ భర్తమేలుఁ
దలతునా, వారి నెయ్యంబు ♦ తగదు ముందు
గొయ్యి వెన్కను జూడగా ♦ నుయ్యియయ్యె 81

[సరోజ విచారముతో కూర్చుండును సంసోను ప్రవేశం)

సంసో:—[తనలో] సరోజ నేను వచ్చునప్పటికి యెదురుగ వచ్చి సమాశ్వా దగా లోనికిఁ గొనిపోయెడిది, నేడేలనో విచారముగ నున్నది. (సమీపించి) ప్రేయసీ! నీవేల యిట్లుంటివి,

గీ. ముద్దులొలికెడి యెఱ్ఱని మోవినుండి
తేనెసోనల నింపెడి తియ్యనైన
పలుకు లాడవదేలనే పద్మగంధి
యంత మాటేల మతిమేల నంతగుంద 33

సరో:—ఏమియును లేదు పరధ్యానమున నుంటిని క్షమింపవలయును. (సంసాను కూర్చుండును) నాథా! నిజముగ మీకు నాపై ప్రేమ లేదుకదా!

సంసా:—[నవ్వుచు] ప్రియసఖీ! లేదని నీవెట్లు చెప్పగలవు?

సరో:—ఎటులా? విందుసమయమున మీరు పిలిపించి నుపై కథ వేసితిరి కదా! దానిలోని మర్మమిట్టిదని ఆత్మీయురాలనగు నాకు చెప్పఁగూడదా?

సంసా:—చెప్పుటకేమిగాని, ఈకథలోని మర్మము నాతలిదండ్రులకైనను చెప్పక దాచితిని నీకెట్లు చెప్పఁగలను?

సరో:—కథ వేసిన దాది దానిని తెలిసికొనవలెనని నా మనసు ఉవ్విళ్లూరుచున్నది. అద్దములోని నీడవలె నా హృదయమున ప్రతిబింబించు మీరే నన్ను వేరుచేయుచుంటిరి అను నాగసియము మెఱిఁగి హృదయములు కలుపుకొనఁ గలవా?

సంసా:—ఆ ప్రాణేశ్వరీ! దాచుటకేమిగాని రేపైనా నిది తెలియునుగదా! చెప్పెదను వినుము మన వివాహమునకై తిరుగ్నాతుకు వచ్చు సమయమున మార్గమధ్యమునందొక సింహరాజము నాపై గర్జించి దుమికినది దైవావేశమున విరోధియను జయించు నేను దానిని చీల్చివైచితిని. మరల కొన్నాళ్లకు వచ్చుచుండ, ఆసింహకళేబరమునందే తేనెపట్టును చూచితిని. అందలి తేనె రుచి యసామాన్యము. నేనడిగిన కథలోని బలముగలది ఆసింహము. తీపైనది అందలి తేనె.

సరో:—అదియా మీకథ. మీకథ చాలా కే యెసుగక. (లేచును)

## రెండవ రంగం



[సరోజా సంసోనులు, సర్దారులు ఆసీనులై యుందురు.)

సంసో:—సర్దారులారా! నేను వేసిన కథకు గడువు నేడేకదా!

1 సర్దా:—ఔను. నేడే,

సంసో:—ముప్పది నారబట్టలను ముప్పది దుస్తులను సిద్ధముచేసి తెచ్చితిరా?

2 సర్దా:—ఓహో! ముందునీ దుస్తుల సంగతి చెప్పుము.

సంసో:—అటులైన కథ విప్పుడు?

1 సర్దా:—

తే. గీ. మనలభక్షించు వానిలో ♦ వనమునందు
బలిబలమైనది మృగముల ♦ బలిభువు కాదె!
తియ్యదనమున నెనలేని ♦ తిండియన్న
అందు దొరకిన తేనెగా ♦ ఆర్యవర్య! 83

సంసో:—[లేచి కోపముతో] మన బంగారము మంచిదైన కంసాలి పను పనియేమి?

తే. గీ. వలవు తలకెక్క మతిలేక ♦ వెలదికేను
దాసుడను నైతి కార్యంబు ♦ దప్పెనిపుడు;
ఆడుదానిని నమ్మిన ♦ వాడు బాగు
పడును; దుర్గతి గల్గుట ♦ బలిమెనాకు 84

ఫిలిస్తీయులారా! పందెమోడితిని. మీకియ్యవలసిన దుస్తులను నేడే తెచ్చి యిచ్చెదను. ఇక మీరు చనుడు.

(సర్దారుల నిష్క్రమణము. సంసోను సరోజ నుద్దేశించి బిగ్గరగా)

సుమతీ! వెఱ్ఱివలపునకు లోనై నీకు బానిసనైతిని. ఆత్మీయురాలవని లాలించి నాచే కథను చెప్పించుకొని, నీవారలకు చెప్పినా పందెము నోడించితివిగా! ఛీ! మాయావినీ! పాపాత్మురాలా! మాట

లతో తేనెను చిలికి మనసున విషము పెట్టుకొందురుగదాయని విడలు!
మాఘిలి స్త్రీయుల పాపపు స్వభావము బయటబడినది.
సరో:—నాథా! క్షమింపుము. ఘిలి స్త్రీయుసరార్రాలు మనల సంహరింతు
 మని బెదరించుటచే వారలకు చెప్పితిని

15 కీర్తన: చాయ: వెలిగింపుమునాలో జ్యోతి.

క్షమియింపవా - నాధానన్నిక ।క్షమి॥
అపరాధిని - నాథానే - న పరాధిని ।
నప మెంచకయ్యా ♦ ప్రాణేశ ।క్షమి।

సంసో:—ఛీ పాపాత్మురాలా! నీముఖము చూడరాదు,

సరోజ: పైకీర్తనలోని రెండవభాగము,

తెలియక చేసిన - నాయపరాధము ।
తలయక నాపై - నలుకయు దేల ।
నీవెనర్వమని - నమ్మితి నాధా ।క్షమి।

సంసో:—ఓసి టక్కులాడీ - నీటక్కరి తనము నాముందా? ఇకనీ
 పొత్తుకూడను (సరోజను తన్ని సంసోను వెళ్ళును)
సరో:— హా! నాధా!... ...నాథా!

16 కీర్తన రాగం. భీంప్లాస్ తా: ఆది.

పోయెనా - నానాధుండు విడి । పోయెనా!
1. కామితార్థములు - తీరక మును పే !
 కాసంతైనను - దయజూడ కనికి ।పోయెనా।
2. నేరక జేసిన - నాయపరాధము ।
 తీరని వైరము - నకు మూలంబయు ।పోయెనా।

(సరోజ నిష్క్రమణము. సంసోను దుస్తుల మూటకొప్పి ప్రవేశం)

సంసో:—(స్వగతము) "కర్ర—కాలుకు చెప్పుదెబ్బ" న్నట్లు పాపాత్ములైన ఫిలిస్తీయులు మోసగించి నాపందెమును గెల్చినందుకు సమీపమునందుగల అష్కెలోను పట్టణంబోయి, అచ్చటి ముప్పది మంది ఫిలిస్తీయ యువకులనే చంపి వారి దుస్తులను నారబట్టలను సంపాదించితిని వీటిని. కథ విప్పిన వారికిచ్చి వారి పొత్తును వదలి యింటికి పోయెదను (తెరపడును)

---

మూడవ రంగము.

---

(సంసోను శయనా మందిరము. పరుండి లేచి)

సంసో:—కటకటా! కట్టెకథ యెంత కష్టమును తెచ్చినది. సరోజ నిజముగ కపటీయా? కాదు కాదు... చివర సమయమున కూడ క్షమింపవలెనని ఫిలిస్తీయుల దౌర్జన్యము వలన తానట్లు చేసితనని, ఓర్పోపినను నా పాపములను వదలక ప్రార్థించుపడినది. సరోజా! కఠినుడనని నన్ను నిందించుచుంటివా? వివాహ సమయమున సత్యదూత చేసిన హితోపదేశము నెట్లు విస్మరించితినోగదా! విద్వేషము లెంత వినాశనమునకు దెచ్చినవి? ప్రేయసీ! క్షమించుము ఇదే నీసందర్శనమునకు వచ్చుచుంటిని [లేచినడచుచు] కంటిలోనిపాపవలె బొందిలోని ప్రాణమువలె అతిమురిపెములు లేక మెలగితిమి, నా యర్ధాంగి యిపుడేమి చేయుచున్నది. యోకజా!

[తెరలోనికి పోవును. ఒక వ్యక్తి నుండి తిమ్నాతీయుడును రెండవ వ్యక్తి నుండి సంసోనును ప్రవేశింతురు)

సంసో:—(స్వగతము) అల్లదిదే నా అత్తవారి యిల్లు, అ నిలబడినది యేనా మామగారవనోవు సరోజలోని గదిలో నుండవచ్చును. [ఆతురతతో తిమ్నాతీయుని వైపు వెళ్ళుచుండును]

శ్రీ జగద్రక్షకాయనమః

# శూర సంసోను



## చతుర్థాంకము.



### మొదటిరంగం

[ఏతాము బండసందులో నివసించు సంసోను
అచ్చటకు చేరిన యూదులు సంసోను తెరలో నుండును]

1 యూదు:—అదిగో! అగపడుచున్నదే ఏతాముకొండ. సంసోను ఆ కొండలోయలోనే నివాసము కల్పించుకొని యున్నాడు కదా! అతని జాడ నెఱిఁగి మన మూఁడువేల యూదుల ప్రాతినిధ్యమున అతనితో సంభాషించి వివరములను మన వారికి తెలియఁజేయుదము (యూదులిద్దరు రెండడుగులు నడచి]

2 యూదు:—ఈబండ సందులోనే సంసోను నివసించును.

1 యూదు:—బిగ్గరగా పిలచినచో మనకతఁడు మారుపలుకును.

2 యూదు:... సంసోనూ! సంసోనూ! [బిగ్గరగా పిలుచును)

సంసో:—[తెరలోనుండి] ఎవరువారు?

1 యూదు:—మేము యూదులము, నీతో మాటలాడ తలసియున్నది దిగి మాయొద్దకు రమ్ము.

సంహా:—(ప్రవేశించిన వెంటనే తెరలో కోలాహలము)
స్నేహితులారా! ఆకర్ణించు జనసమూహము ఇచ్చటకు చేరుటకు కారణమేమి? వారెవ్వరు? యూదులా? ఫిలిస్తీయులా?

2 యూదు:—అందరునుకలరు. నీవల్ల మాయూదులకెంత కష్టము ఘటిల్లినదో చూడుము.

సంహా:—నావలన మీకేమి కష్టము?

1 యూదు:—కష్టము కాదా? నీవు మూడు వందల నక్కలను పట్టి రెండేసి నక్కల తోకలకు దివిటీల నంటుగట్టి, ఫిలిస్తీయుల ద్రాక్షతోటలను ఒలీవాతోటలను నిర్మూలముగ పాడు చేయుటయేగాక. మీదకు వచ్చిన వారిని నరికి పట్టిచంపి మాదేశము వచ్చి నివాస మిచ్చుట యోగ్యమ [illegible].

సంహా:—ఔను. వారు నాకు చేసిన అపకారమునకు తగిన ప్రతీకారము నేను చేసితిని.

1 యూదు:— ఫిలిస్తీయులు మనలను ఏలుచున్నారని నీ వెరిగియుండవా?

సంహా:—తెలియకేమి వారు మహోన్మత్తులై. వారికి తగిన ప్రాయశ్చిత్తమునే చేసితిని.

2. యూదు:—నీకు మేము రక్షణ యిచ్చితిమని, వారు మాపై దండెత్తి వచ్చిరి.

1 యూదు:—వారు మనకు ప్రభువులగుటచే మనము వారికి లోబడవలెను. మరియు వారలు బలవంతులు. వారిని ప్రతిఘటించి మమ్ములను నీకొరకై వృథానాశమునకు [illegible]దువా?

సంహా:—ప్రజాసౌఖ్య మెరుగని ప్రభువులు ప్రభువులుకారు. అట్టి వారిని ప్రతిఘటించిన నేమి?

1 యూదు:—మేము నిన్ను పట్టి కట్టి వారికి అప్పగించవలెను. లేనిచో నీనిమిత్తమై వారు మమ్ము నాశన మొనర్చెదరు. ఏమందువు?

సంసో:---స్నేహితులారా! నా నిమిత్తమై మీ యూదుల కందఱకును యిక్కట్టు రావలెనా? నన్ను బంధించి ఫిలిస్తీయుల కొప్పగింపుడు. కాని మీరు నన్ను చంపమని, వారి కప్పగించుట వరకే మా బాధ్యతయని నాతో ప్రమాణము చేయుడు. కాదని మీకు నేను లొంగను.

2 యూదు:--- మేము నిన్ను ఫిలిస్తీయుల కిచ్చెద మని ఒడంబడిక చేసుకొని వచ్చితిమి. నీవు మాకు చిక్కినచో నిన్ను చంపవలసిన పని మాకేమి? నిన్ను మేము ఫిలిస్తీయులకు పట్టియిత్తుమే కాని చంపమని యెహోవా దేవుని యెదుట ప్రమాణము చేయుచున్నాము.

సంసో:---అట్లైన బంధించుడు. (సంసోను తన రెండుచేతులను వారి కందించును. వారు త్రాళ్ళతో బంధించి తెరలోనికి తీసుకొని పోయి వెంటనే రంగస్థల ప్రక్కగా ప్రవేశింతురు మరొకవైపు నుండి ఫిలిస్తీయ సర్దారులు ప్రవేశింతురు.)

1 యూదు:---ఓ ఫిలిస్తీయులారా! ఇదుగో సంసోను. బంధించి తెచ్చితిమి. ఇతనిని మీరేమి చేసుకొనిన మాకేమి? మా బాధ్యత తీరినది. సెలవిక మేము పోయెదము (యూదులు నిష్క్రమింతురు)

1 సర్దా:---(రెండవవానితో) అదుగో! మనవారు మన కొఱకై యెదురు చూచుచున్నారు. ఈసిగ్గుమాలిన సంసోనును వారి యొద్దకు తీసుకొని పోదము.

2 సర్దా:---ఓరీ సంసోనూ! మొనగానివలె బిఱ్ఱబిగిసెద వేమిరా?

తే. గీ. పొగరు తలకెక్కి కండ్లకు పొరలు గప్పి
యెవ్వరిని లెక్కసేయక ♦ నెగిరి పడితి
వింత దిక్కను నిపుడు నీ♦ కేది దిక్కు?
పట్టుబడితివి నీ వెట్లు ♦ బ్రతుకఁగలవు? 36

ప్రభూ! నీయాత్మ నాపై ప్రవేశించుటవలన అల్పుండనగు నేను ఫిలిస్తీయులను కుప్పలు కుప్పలుగా వేయిమందిని గాడిద యెముకతో సంహరించితిని. అబ్బబ్బా! ఆయాసమునకుతోడు దాహబాధకూడ మితిమీరి సత్తువపోయి నిస్త్రాణ వచ్చినది ఇక్కడెక్కడను నీరు దొరకుట దుర్లభము, దేవా!.........

చం. బడలికగల్గె దప్పికయు ♦ పైకొన, నాలుకయెండె ప్రాణముల్
విడిచెడు చందమయ్యె, కను ♦ వేమరు వేడెద నార్తింజెందినా.
యొడఁడవౌ నా నీసింహుల ♦ వెచ్చట దోపగరావు దేవ! నా
యొడయఁడ ప్రీతిగాదె యిఁపు♦ డోయ్యనఁ గావగరాదె యో ప్రభో! ౩౯

దేవా! సింహపరాక్రమమిచ్చి నాచే యిందఱ ఫిలిస్తీయులను సంహరింపఁజేసి చివరకీ దాహబాధచేత మడియఁజేయఁ జూచితివా? (నిట్టూర్చి, కన్నులుమూసి కొంతసేపటికి కన్నులు తెఱచి ఆశ్చర్యముతో ప్రక్కతెర (Side curtain) వైపు చూచుచు) ఆహా! ఏమీ! నీదయావిశేషము భూమిని బ్రద్దలు చేసి నాదాహబాధకై నీటిని పైకి తెచ్చితివా? (లోనికిపోయి నీరుత్రాగినట్లుగా నటించుచు మరల ప్రవేశించి] ఎంత తియ్యని నీరు! శ్రమవాపి నిండుసత్తువ నిచ్చినది దయామయా? సర్వేశ్వరా! నీవు తలంచుకొనిన నేమి చేయలేవు? నీకెంతయుఁ గృతజ్ఞుఁడను. ఎట్లును ఫిలిస్తీయులు నా వెంటాడెదరు ఈ సమీపమందలి గాజాపట్టణ వేశ్యవాటికలో రహస్యముగ యీరాత్రి గడిపి తెల్లవారక పూర్వమే మఱియొకచోటికి బోయెద. [యవనిక వ్రాలును]

---

## రెండవ రంగము

(గాజా పట్టణపు వేశ్య తన గృహమునం దొంటరిగ నుండును)

17 కీర్తన - చాయ - మాధవ దర్శన

కాలము గడియుచు సలాగోయి ॥కాలం॥

వన్నె కానిని - ప్రాణసమానుని

కనఁగను - నాకరువుదీరఁగ ॥కాలము॥

1. నన్నెడఁ బాయక - మన్ననఁజూపు

నామనోహరు - నే కలయుటునా ॥కాలము॥

(సంసోను ప్రవేశించి తనలో) ఇది వేశ్యయిల్లు ఈమె విటునికొఱకై నిరీక్షించుచున్నది. వెతకఁబోయిన తీగె కాలికిఁ దగిలినట్లు నాయువసరము మంచి పాళానపడ్డది. ఈమెను సమీపించి చలోక్తిగా ముచ్చటించి యీ రాత్రి యిందు గడిపెద గాక [వేశ్యను సమీపించి] భోగవతీ!

వేశ్య :— ఎవరది? (లేచి సమీపించును)

సంసో :— నేనిస్రాయేలీయుఁడను. పేరు సంసోను. ఈరాత్రి యిందు గడపవచ్చితిని మరియు నీ సంగము వినుటతోడనే నా యను రాగము నీపైకిఁ బోయినది.

వేశ్య :— నిజమె. పురుషు లెంత కనను బాగాలా.

సంసో :—

చం. కలికిమిటారి! మేలయిన ♦ కాయజు చేతికటారి! సొంపునన్

చెలువలమేలుబంతి రతి♦చేతఁజెలంగెడు పూలబంతి, చం

చలనిభగాత్రి కోమ వికచ ♦ సారసపత్రవిశాల నేత్రి, నీ

చెలువము మెచ్చి నేనిట వచ్చితి నందియ మేలె నేసఖి 40

వేశ్య:— ప్రియా! నీపలుకులు, నీయాకారము ఒకదాని నొకటి మించినవి.

చం. పురుషులు లేరె యీభువిని ♦ పూర్వవిలాస విశేషసంపదల్
కరమరుదారు నాకృతిని ♦ కమ్రితరాద్భుత బాహ్యమత్కృతిన్
అరుదుగ నిన్నుఁబోలువఁగ ♦ లట్టి విటాగ్రణిఁ గాంచుఁజూడనో
పురుషవరేణ్య! నిక్కముగ ♦ బుద్ధిజనించెను నీదుపొందుకున్. 41

సంసో:—విటకత్తెవుకదా! విటునిమెచ్చికచేయు ఉపాయము యెరుఁగ
కుందువా?

వేశ్య:—ఏమీ! వేశ్యలలో ధనాపేక్షయున్న హృదయము లేదనియా?
ఆనుకూలపతికి అనురక్తునితో సంయోగము ఆనందము
నీయదా?

తే. గీ. నిష్కపట వృత్తిఁ దెల్పెద ♦ నీటుకాఁడ
ధనమునకెగాదు నీదుసుం ♦ దరవయోవి
శేషమును జూచి నీకునేఁ ♦ జిక్కియుంటి
చులకగాఁ జూడఁదగదయ్య ♦ సుందరాంగ 42

సంసో:—మఱి నాహృదయము నీహృదయము వంటిదికాదా?

18 డైలాగ్ కీర్తన. చాయ : ధీరెధీరె

వేశ్య:— జాలమేల తాళఁ - జాలగానలోల
మేలు పడినన్నేలు కోర - మారనుకు మార ||జా||

సంసో:—జౌను చాన నీసమాన - నేను గాన .
మేను మేను కదియనిం పౌ - నౌను రాగదవె ||జా||

ఇద్దరు:— హాయి హాయిహాయి - హాయిగలిగె
హాయిగలై హాయిగలై - హాయిగలైనుగా ||జా|

[చెట్టాపట్టీలతో యిద్దరు నిష్క్రమింతురు. సర్దారుల ప్రవేశం]

1 సర్దా:—సంసోను యీపట్టణములోనికి ప్రవేశించెను. ఈరాత్రి
అతనిని కనుగొనుటకష్టము యీపట్టణ ద్వారమువద్ద మనస్సైని

కులతో పొంచియుండి, తెల్లవారిన పిదప అతనిని వెతకి పట్టి చంపుదము.

2 సర్దా:—ఔను. పట్టణములోనున్న వారిని చీకటిలో వెదకుటెంత కష్టము. లోనికి పోయినవాడు బయటకు తప్పించుకొని రాకుండ, పట్టణపుగవని ఎద్ద కాపుందము.

1 సర్దా:—మన వారికిట్లే హెచ్చరించుదము రమ్ము. [నిష్క్రమింతురు రెండవ ప్రక్కగా సంసోను ప్రవేశించి)

సంసో:—(తనలో) అర్ధరాత్రిదాట వచ్చినది ఫిలిస్తీయుల కోలాహల ధ్వని విన వచ్చుచున్నది ఇందున్న ప్రమాదము కలుగగూడదు. [రెండడుగులు వేసి) అదిగో! పట్టణసింహద్వారము. (ప్రక్క తెరవైపు చెవినొగ్గి) ఫిలిస్తీయులింక దేయున్నారు. ఈద్వారబంధము నూడబెరికి వేయుద [సంసోను ఒక ప్రక్కగా పరుగెత్తును. సర్దారులు రెండవ ప్రక్కగా పరుగున వత్తురు]

1 సర్దా:—తలుపు దర్వాజా అడ్డుకర్రలతో నూడబెరికి భుజమున బెట్టుకొని పారిపోవుచున్నాడు

2 సర్దా:—ఈచీకటిలో వాని కెదురుబోయిన యెవరినైన చంపును.

1 సర్దా:—నిజమే వానికెదురుబడి మనమతనిని చంపలేకున్నాము. వానిలో మనకు తెలియని దైవావేశమున్నది

2 సర్దా:—ఔను. అతనికింత బలమెట్లున్నదో మనము తెలిసికొనవలెను. కాని మనకెట్లు సాధ్యము?

1 సర్దా:—ఆలోచింతుము. వాడెందుకు పోవునో మనకు తెలియవలెను గదా! పోదము రమ్ము. (తెరపడును)

—•—

## మూడవరంగము.

---

(సంసోను ప్రవేశము)

సంసో:—కటకటా! ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతినై యిరువది సంవత్సరములు గడపితిని. ఫిలిస్తీయులకును నాకును తీరని వైరము సంప్రాప్తించినది చాటుమాటున మెలగవలసినదే కాని బహిరంగముగ తిరుగుటకు వీలుకాదు ఇచ్చటకు సమీపమున దెలీలాయను నొక యువతికలదట ఆమెయొక్క సౌందర్యవతియో అంత గుణసరియని వింటిని. ఆమెనెట్లైన వశముం జేసికొని జీవయాత్రను గడిపెద. అగన్పించునదియే ఆమెయిల్లు (రెండడుగులువేసి తెరవైపులోనికి చూచుచు) అదిగో! ఆమెయే వచ్చుచున్నది. ఆహా! ఏమీ! ఆమె సోయగము (దెలీలా ప్రవేశించును. సంసోను ఆమెను సమీపించి) భాగ్యవతీ! మాది దూరదేశము. ఇందెవ్వరిసినే నెఱుగను. ఈనాడిచ్చట విశ్రమించుటకు వీలగునా?

దెలీ:—ఇందెవరిని యెఱుగక నన్నే తెలిసికొంటివి కాంబోలు. చల్లకు వచ్చి ముంత దాచనేల?

సంసో:—నీవు సరసురాలవని తెలిసియే నీయాశ్రయమునకు వచ్చితిని

దెలీ:—అండకు వచ్చిన వారిని విడనాడుదురా?

సంసో:—"స్త్రీ చిత్తము పురుష భాగ్యమను సామెతకలదుగదా!

దెలీ:—ఎంతగడుసరివి... రమ్ము... ఇటుకూర్చుండుము నీవు వరసజ్జుండవు ఈ అద్దమును చూపుము పాపటను దిద్దుకొనెదను. (సంసోను ఆమెవైపు అద్దమును చూపును. ఆమె పాపటను సవరించుకొనుచు సగర్వముగా)

19 కీర్తన: చాయ – హేమనిముబతా.

నావిలాసము - నాయొయ్యారము ।
ఈజగాన నను మినహా ♦ యేరికయున ।
కలవెకలవె యొంౖదైన - కండ్లనొంపేనా ।
ఆహా! నొసలు సొబగేనా ||నావిలాస||
ఆహా! ఏమి నాసుందరాకారము !

గీ. మోము కాంతులు సోముని ♦ గోముఁదెగడు
కల్వరేకులె నాసోగ కనులతీరు
నాజగన్మోహనైక సౌందర్యమునకు
భ్రమసి వశ్యముఁగాకుండు ♦ వాఁడెవండు? 43

సంసో:—మఱెవఁడు గలఁడు?

ఉ. నీదు ముఖేందుకాంతియును, ♦ నీదుకపోలకళావిలాసముల్,
నీదు వెడందచూపులును, ♦ నీకుచకుంభములంద చందముల్
నీదు మృదూక్తి వైఖరియు, ♦ నీటుగు నంచలనెన్ను నెన్నడల్,
నాదు మనోధనంబులల ♦ నా! హరియించె నికేమిదెల్పుదున్ 44

డెలీ:—సంగీతమునకు తోడు కవిత్వము నల్లుచుంటివే! స్మృతినిమించి రాగానఁ బడ్డది.

ఉ. కన్నుల చందమున్నగు మొ ♦ గంబు విధంబును, మోవికెంపియున్
చన్నుల బింకమున్ కనుప ♦ సందపు కంధరమున్, దళంబులౌ
వెన్నెలలందు నందమును, బిత్తరి! నీదు హావముల్గనంగనే
కన్నియ లీడుగారు; నను ♦ గ్రన్నన చేకొనవే, తలోదరీ! 45

ఉ. కాయముడస్సె, నాహృదయ కైరవ మాతపముఁ వడఁజొచ్చె, నా
హా! యిఁక నేమనందు ప్రి ♦ యా జ్వరబాధ సహింపఁజాల, న
య్యో! యితరౌషధావళులు ♦ యుక్తములౌనవి బాధమాన్పఁగా
నీయధరామృతౌషధము ♦ నెయ్యముమీరఁ నను గ్రహింపవే. 46

జలీ:—నీవిన్నాణమునకు, చాతుర్యమునకును నాహృదయము డోయిలించుచున్నది. అనురాగరంజితమైన ప్రాణనోరత్నమును యింతలింతలుగజేసి హారమొనరించి నీకు వేసుకొనియెద. నామోహనాకారా!

ఉ. సారస పత్రనేత్రములు ♦ చారు విలోచనముల్ ప్రపూర్ణిమాంభోరుహ వైరిం నెన్నదగు నీసగు మోము, ప్రవాళపాళికిన్
మీరుఘటింపం జాలురుచి ♦ తోదగు మోవియుంజూడ నెట్టి శాతోదరులైన మెచ్చితం ♦ లూదిత మిందరిఃజేరకుందురే? 47

సంసో:—మనోహారిణీ! సంతసించితిని. నాసర్వస్వమును నీకేసమర్పించుకొనియెద.

20 డైలాగ్ కీర్తన: చాయ: జాగేల వెరపేల.

జలీ:— రారాదా - భయమేల!
ఉందిము హాయిచెలంగగను - కడుహాయి చేలంగగను!
నిజమేకాదా - తియ్యనివలపు - సౌఖ్యసుధామయమోయి!

సంసో:— రాగము, మోహము - పొంగిపోగా - తేలిపోదామా
ప్రేమడోలిక నెక్కి మనము - ఊగిపోదామా!

ఇద్దరు:—హాయిగ - హాయిగ! ఉందము హాయిచెలంగగను!కడు!

(తెరపడును)

నా లు గ వ రం గ ము.

(గలిలా ఆసీనయైయుండును. సర్దారుల ప్రవేశము)

జలీ:—[లేచి] ఓహో! శిలిస్త్రీయ సర్దారులా! పొద్దుపోయివచ్చితిరేమి?

1 సర్దా:—కార్యార్థులమై వచ్చితిమి. ఆపని నీవే సాధించగలవు.

దెలీ:—నావలన నేమి కాఁగలదు? కాఁగల్గినచో మీకు జవదాటుదునా?

2 సర్దా:—ఇశ్రాయేలీయుల న్యాయాధిపతియైన సంసోను నీకు విటకాఁడై నీయింట నున్నాఁడని విని వచ్చితిమి. అతఁడు ఫిలిస్తీయులకు చాల అపకారము చేసెను. వానిలో మనకు తెలియని దైవావేశ పూర్వకమైన మహాబలము కలదు. ఎంత యెదిరించినను అతఁడు తప్పించుకొని పోఁగలఁడు. అతని బలమెందుఁ గలదో, ఆబలము పోయి యెట్లు వశముకాఁగలఁడో, నీవు అతనిని లాలనచేసి తెలిసికొని మాకు చెప్పవలెను.

1 సర్దా:—అట్లు చెప్పినచో మాలో ప్రతివారము వేయినూఱు రూపాయిలు చొప్పున నీకిచ్చెదము.

దెలీ:—అయ్యో! అనురాగముతో కూడిన నాజీవితమును మీరు చెఱుపఁ జెంచితిరా? అతఁడు చాల అసాధ్యుఁడు. తన రహస్యమును నాకు తెలియఁజెప్పఁడు. అదియును గాక;

గీ. కటకటా! విశ్వసించిన ♦ విటుని మిగుల
కపటమున ధనమునాశించి ♦ కరుణఁదొఱఁగి
చెఱుపఁ జెంచుట కంటెను ♦ చెడ్డనేత
కలదె? యెంతైన పాపము ♦ కాదె తలఁప 46

2 సర్దా:—ఏమేమీ! నీవు వెలయాలివని మేమెఱుఁగమా? ఎదురాడినచో నీకు వచ్చు డబ్బును పోగొట్టుకొనుటయే గాక నీప్రాణములుం గూడ పోవును.

1 సర్దా:—ఇంతయేల? ఈకార్యమును నీవు సాధించక పోయినచో ముందు నీచావు తప్పదు. గ్రహించుము.

దెలీ:—ఆగ్రహింపకుడు నాకు గడువిండు. నాశక్తికొలఁది ప్రయత్నించెదను, అతఁడు వచ్చువేళ అయినది. అతఁడు మనలను

చూచినచో మన ప్రయత్నమెట్లున్నను ప్రమాదము కలు
గును కాన పోయెదను (పర్దారుల నిష్క్రమణము]

దెలీ:—[తనలో] చాలచిక్కు వచ్చినది. సంసోను తన రహస్యమును
చెప్పక పోయినచో, నాకే ముప్పు రాగలదు. పోనీ, అతఁడు
తన రహస్యమును చెప్పిన అతనికేమి ముప్పు రాగలదో కదా!
(ఆలోచించి) అయిన అతనివల్ల నాకగు ఉపయోగమేమి?
అతని నాశించిన, ధనము నా ప్రాణమును పోగొట్టుకొనుటయే
కదా! ఎట్టులైన యాతనిని లాలించి తెలిసికొనుటయే నాకర్త
వ్యము, అదియునుగాక,

చ. ధనముగడించుటే పరమ ◆ ధర్మము మానవులకుందు, నందునే
జననము నందితిన్, మఱియు ◆ చక్కదనంబున నాట పాటలం
దున కడు పేరుగాంచితిని ◆ దోషమటంచు దలంక నేల? యీ
ధనమును స్వీకరించుటకు ◆ తప్పక నేఁడె సంగ్రహించెదన్. 49

[యవనిక వ్రాలును. చతుర్థాంకము సమాప్తము]

శ్రీ జగద్రక్షకాయనమః

# శూర సంసోను.



# పంచమాంకము.



మొదటి రంగము

(దెలీలా విచారముగా పరుండి యుండును సంసోను ప్రవేశం)

సంసో:—[స్వగతము] నేడేలకో దెలీలా విచారముగ నున్నది. తెలిసి

డైలాగ్ కీర్తన ఖమాంజ్ రాగము - త్రిశాల్

డెలీ:— ఆనందమిదియేగా...... ఆనంద।

సంసో:—అఖిల భోగాభాగ్యము కలదు - అనుభవించంగా।

డెలీ:--- ఆనంద మిక నాసామ్మేగా।

సంసో:--- అతివరో! నీవిక నాసామ్మేగా।

ఇద్దరు:----ఆనందమే - ఆనందమే - ఆనందమిదియేగా ।ఆనంద।

(పాడుచు లోనికి పోవుదురు మరల ఒకవైపునుండి

డెలీలా మరొకవైపునుండి 1సర్దారు వత్తురు)

1 సర్దా:----డెలీలా! కార్యమును చక్కఁ బెట్టితివా?

డెలీ:---ఏడు నిరవంజి చువ్వలతో బంధించిన, అతని బలము పోవు

నఁట కాన శీఘ్రముగా నిరవంజి చువ్వలను తెండు.

1 సర్దా---సరే! తత్క్షణమే పంపెదను. జాగ్రత్త పోయివచ్చెదను.

తెరవాలును)

---

[సంసోను ఆసీనుఁడై యుండును. డెలీలాచువ్వలతో ప్రవేశం]

డెలీ:--సఖా! నిన్ను పరీక్షించుసమయము వచ్చినది, నిరవంజి చువ్వ

లతో నిన్ను బంధింపనిమ్ము?

సంసో:--ఎంతపట్టుదలగలదానవు సరే బంధించుము (డెలీలా బంధిం

చును. సంసోను బలముపోయినట్లు నటించును]

డెలీ:--ప్రియా! ఫిలిస్తీయులు యీసమయమున వచ్చిననీవేమి

చేయుదువు?

సంసో---ఏమిచేయుదును. నన్ను కాపాడుభారము నీదికాదా! (డెలీ

లాలోనికి పోయి తిరిగివచ్చి)

దెలీ—అయ్యో! కొంప మునిగినది. ఫిలిస్తీయులు కొట్టువచ్చుచున్నారు. త్వరపడుము. త్వరపడుము:

సంసో—(చువ్వలను తెంపి, అటుయిటు చూచి) ఎంత భయపెట్టితివి నిజముగ వచ్చినట్లే చెప్పితివి.

దెలీ—నేను నిన్ను పరీక్షించెదనని చెప్పలేదా నీదుర్బుద్ధి బయటపడినది.

సంసో—పరిహాసమునకే యింతేను కోపవలెనా? ఈసారి నిజము చెప్పెదను.

దెలీ—ఈసారి మాత్రము నిజమని యెట్లను కొందును?

తే. గీ. నన్ను మొగతాళి చేసితి ♦ వెన్నసేల?
నిక్కముగు ప్రేమ లేదు బల్లిక్కలాఁడ
మోసపుచ్చితి వేమందు ♦ దోసమనక
తెలియలేనైతి నీమది ♦ తెలివి లేక 52

సంసో—ప్రియురాలీ! ఎందుకీ నిష్ఠురము. ఇదిగో! వినుము.

ఉ. పేనిన తాళ్లనే పనికి ♦ పెట్టని నూతనమైన వాటిచేఁ
బూనికతోడఁ గట్టినను ♦ పోవుఁ మదీయబలంబు యిట్లు కా.
దేని మదుక్తి నమ్ముకుము ♦ రెప్పటికిన్నిది బల్కువాఁడని
తో నన్నృతంబులాడుదునె ♦ తోరపు ప్రేమతోలంగనె ద్వేలీ! 53

దెలీ—నన్నింత అమాయకురాలనుగా జేసితివి. నిరవంజి చువ్వలంతటి వానిని యవలీలగా విరచి, వినిపించుకొనిన నీకు యీతాళ్లు లొకలెక్కా? బిగించినను నమ్మఁదగినట్లుండవలదా? నీబలమునే నెఱుఁగనా? ఇంతయేల?

తే. గీ. ప్రేమశూన్యుఁడ! టక్కరి ♦ వేషగాఁడ
యిచ్చకములాడి వంచింప ♦ నెంచెదీవు
నన్ను నమ్మక వర్తించు ♦ నిన్నెఱుఁగనో?
పొమ్ము నీదారి, వలదు నీ ♦ పొత్తునాకు 54

సంసో——ఎంతపట్టు పట్టుచున్నావు. నాలోని రహస్యము చెప్పుమని, నాబలము పోవుపరీక్ష నీవే చేయుచున్నావు. ఎంత అనువర్తనుం డనై మెలంగినను నీకు విశ్వాసము పుట్టలేదు.

దెలీ——విశ్వాసము పుట్టునట్లు చెప్పిన సత్యమందునా?

సంసో——ఎగతాళియనుకొనక నిజము చెప్పుచున్నాను, నాతల వెంట్రుకలను యేడుజడలుగా అల్లిమేకులతో పాతిననా బలము తొలగిపోవును.

దెలీ——నమ్మక చేయున దేమున్నది.

సంసో——నీకు విశ్వాసముండకపోతే నేకాక, నిజము చెప్పితినికదా! ఆయాస పెట్టకుము. నిద్రవచ్చుచున్నది పరుండవలెను.
(సంసోను దెలీలా తొడమై పరుండి నిద్రపోవును. దెలీలా మెల్లగా జడలనల్లి మేకులను పాతి జడలను కట్టును.)

22 జోల పాట

1 ప్రియా! జోజోజో నామోహనాంగ సఖ! సుకుమారగాత్ర్ ।జో।
నాహృదయములో దీప్తిగ నుండవె - నామోహనమూర్తివి కావె।
గానమాధురిని నిదురను పోవె - కాముకలోల ప్రియమార శరీర ।జో।

2 నాప్రాణనాథుడవు కావె - నాముద్దులమూటవు నీవె।
జోలబాడెదను నిదురను పోవె-శూరపరాక్రమసింహగభీర।జో।

దెలీ——సంసోనూ! లెమ్ములెమ్ము ఫిలిస్తీయులు వచ్చుచున్నారు.

సంసో——(త్రుళ్లిపడి మేకులను పీకొని తలవిదుల్చుచు లేచును)
అబ్బా! నిద్రలోన పరీక్ష పెట్టితివా?

దెలీ——మోసకాడా! నీటక్కరి మాటలచే నన్ను బులిపించిననే నుబ్బు లాటవా? నిన్ను నమ్ముదునా? ఛీ! సిగ్గులేక నావెంట వచ్చెద వెందులకు పొమ్ము.

కీర్తన:

చెనటి నీవు నా - చెంతకురాకుము! ఛీఛీఛీ ।చెనటి॥
చీటికి మాటికి - చేరకుపోపో ।చెనటి॥

[దెలీలా చిరాకుతో లోనికి పోవును)

సంసో:--(లోనలో) స్త్రీలను నమ్మరాదు. కాని స్త్రీ పొందు విడనాడి వేరుగా నుండలేముకదా! దెలీలా చాల మొండిగా మెలఁగు చున్నది. పూర్వప్రీతి యిప్పుడు నాయందులేదు. వారకాంత కదా! విశ్వసించి నాచావును నేనెట్లు చెప్పుకొందును, పోనీ చెప్పినను పరీక్షపెట్టకమానునా?

ఉ. అంతము నొందు నాబలము ♦ నంతియు మర్మముఁ దెల్పనందులో
నింతులనమ్మవచ్చునె? న ♦ యేతరవృత్తిని సంచరింతురా
వంతయు జంకరెట్టి పని ♦ యైనను జేయగ సాహసింత్రు, అ
త్యంతము నింతికిన్వశుఁడ ♦ నైతిని, పోవునె? వచ్చుకష్టముల్ 55

చూడఁ జూడ నాలో దిగులు, భయము పుట్టుచున్నది. ఏదో యాపద కలుగనున్నదని నాహృదయము చెప్పుచున్నది. దెలీలాయందలి మోహపాశములు నన్ను బంధించినవి. వాటిని త్రెంచుకొని పోలేకున్నాను. పోయినను నాకు సుఖమేది? ఫిలిస్తీయులచేతనైన మృత్యువు తప్పదు. ఇంక నిశ్రాయేలీయులకు తీరుపరి నగుటకల్ల బ్రతికిన నేమిలాభము.

చం. అతికఠినంబులై బటువు ♦ లౌజవరాంగ్రకు చాతిఘర్షణ
స్థితిదనరారె వక్షము, ప్ర ♦ సిద్ధబలాధికులైన శత్రుసం
తతిని హతంబుఁజేయుటను ♦ హస్తములందువ తీటఁబాసె; కా
మితము ఘటిల్ల పౌరుషము ♦ మీరఁ చరించితి నీవసుంధరన్ 56

నే ననుభవించవలసిన సుఖమేదో, అనుభవించితిని. మరణ మాసన్నమైన నగుఁగాక! డెలీలా వాంఛఁదీర్చెద.

(యవనిక పడును.)



రెండవ రంగము.

(డెలీలా ఆసీనయైయుండును. సంసోను ప్రవేశము]

సంసో:—ప్రియసీ! ప్రియసీ! [డెలీలాను సమీపించును]

డెలీ:—[తటాలున లేచి) ఛీ! ఎంతసిగ్గులేనివాఁడవు ఛీదరించుకొని నను పెంపుడు కుక్కవలె వెంటాడెద మేమి?

సంసో:—మనోహారిణీ! నిజముగా దోషిని నాతప్పును క్షమింపుము.

డెలీ:—ఎంతనయగారివి? ఇప్పటికి ముమ్మాఱు నీసక్కవిసయముతో నన్ను మోసగించితివి.

తే. గీ. అంగిట విషంబు నాల్కపై ♦ నమృతరసము
యెట్టు లలవడఁజేసితో ♦ యెఱుఁగ రాదు
ఇంత దన్కను మోసపో ♦ యి తిని, నీదు
యాటలిఁక సాగవేగుమో ♦ నీటుకాఁడ 57

[డెలీలా కోపముతో లోనికి పోఁబోవును. సంసోను అడ్డమువచ్చి)

సంసో:—డెలీలా! ఈసారి నన్ను నమ్ముము. ముమ్మాటికి నమ్ముము.

డెలీ:—నిన్ను నేను నమ్మను. ఎంత విదలించుకొనినను వదలక వెంట తిరుగు వెంగలివైతివి. సిగ్గులేదా?

సంసో:—ప్రియసీ! కోపము విడువవా? జాలిలేదా? నావైపు చూడుము.

చం. అలుక యిదేలనే చెలియ ♦ అవలి మోమిడనేల నేనఖ!
వలుక వదేలనే విరసవర్తనమేలనె మోహనాంగి! నీ

తలపు ఘటించుతు నమ్మునను ♦ తామరసేక్షణ! జాగ దేల
దలపుము నీదు దాసునిగ ♦ తాళగజాల నను గ్రహింపవే. 58

డలీ:—వేయేల? నిజము చెప్పఁదలంచిన చెప్పుము లేదా నీదారిని నీవుపొమ్ము.

సంసో:—డెలీలా! రక్షించినను భక్షించినను నీవే. నాప్రాణమును నీచేతి కప్పగించుచున్నాను. ఇదిగో! వాస్తవము చెప్పుచున్నాను వినుము. సంతానములేక నాతల్లి దేవునికి వ్రతముఁజేసినది. నాజననమునకు పూర్వము దేవదూత నాతల్లితో చెప్పిన మాటలు యివి.

తే. గీ. క్షౌరకుని కత్తిచేతను ♦ శిరము గొఱుఁగ
బలము సర్వంబు పోయినే ♦ చులకనగుదు
కాన, పెన్నెఱుల్ తీయక ♦ పెనిచినాఁడ
దైవవాక్యంబు యిద్ది న - త్యంబు తరుణి 59

డలీ:—సంతసించితిని. ఈసారి నీమాటలు విశ్వాసార్హములు.

24 డైలాగ్ సాంగ్

డలీ:—నామోహనాంగా ♦ ముదమాయెగ - ఈనాటికి ।నామో।
నీయాశలన్ నేదీర్చెదన్ - అనుతాపము యింకేలరా।

సంసో:-నాప్రియసఖియా - ముదమాయెగా - ఈనాటికి ।నాప్రియ।
జాగేలనే! నీవాఁడను - నినుఁబాసినే నెటులోర్తును।

ఇద్దరు:-ఒండొరులకున్ -ముదమాయెగ ।ఈనాటికి।

(పాటపాడుచు నిష్క్రమింతురు. 1వ సర్దారు ఒకవైపున డెలీలా మఱొకవైపున ప్రవేశం]

1 సర్దా:—డెలీలా! చాలకాలము గడచినది. ఇంకను మన పనిని పూర్తిచేయవైతివి.

డెలీ:—సంసోనును లాలించుట వలన లాభము లేక పోయినది, చివరకు బెదిరించి తెలిసికొనఁ గల్గితిని.

1 సర్దా:—తెలిసికొంటివా? ఏమని?

డెలీ:—అతఁడు దేవుని వరమున పుట్టిన వాఁడఁట. అతని తలపై మంగలికత్తి పడరాదనియు, అట్లుపడిన బలము పోవుననియు, అతని జననమునకు పూర్వము దేవదూత అతని తల్లికి సాక్షాత్కరించి చెప్పెనఁట. ఇంతవరకు క్షౌరము చేయించుకొనకుండుటకు కారణ మిదియేనఁట రేపురాత్రికి సొమ్ము సిద్ధముఁ జేసి నేరువరియైన మంగలిని వెంటఁబెట్టుకొని యీయంతఃపురమున దాగియుండుడి అతనిని నిద్రవుచ్చి మంగలిచేత తల గొరిగించి మిమ్ములను పిలచెద. పిదప మీయిష్టము.

1 సర్దా:—అట్లైన మంగలితో రేపురాత్రికి వచ్చెదము. కడు జాగరూకతతో మెలఁగుము. లేనిచో మనకు ప్రమాదము.

(యవనిక వ్రాలును.)

—♦—

## మూఁడవ రంగము.

---

[మంగలి ప్రవేశము)

మంగ:—(తనలో) డబ్బు సంపాదించాలంటే మామంగలి వృత్తే పోయి. కష్టంలేదు. సుఖమావుంది. పెట్టుబడిలేని వ్యాపారం. లక్షాధికారులైనా నష్టం వచ్చేటప్పటికి పొట్టవుచ్చుకొని భిక్షం యెత్తాల్సిందే. రోజంతా కూలోడిలాగ కష్టపడవలసిన పనిలేదు. .. ఎంతలావోడితలైనా, నాయెడమచేతి గుప్పిట్లోకి రావల్సిందే. నేను కుడిపినట్లల్ల వూరుకోవల్సిందే. పొద్దున్నే లేచి పదియిండ్లు తిరిగి పదితలలు గొరిగేనంటే

నావస్నై పోతుంది. టింగు రంగాయని కాలుమీద కాలేసుక్కూ
కుంటే నన్ననేదెవడు, ఆ! చావొచ్చింది. మంచివాణ్ణని
పెద్దపెద్దోరంతా నన్నే పిలుస్తారు. సంసోను దెలీలా యింట్లో
వున్నాడట. ఆయన నిద్రపోతుంటే మెలకువ రాకుండ తల
గొరిగి తప్పించుకొని పారిపోవాలంట గొరుగుతుండగా లేచాడా?
నాపెండ్లి పట్టించేడే. సర్దారుదొరలు మాయింటికి వచ్చి వడి
గాపులు వడివున్నారు. సర్దారుదొరలు లెక్కేమిటి? వాళ్ళ
తాతలంటోళ్ళు మహాప్రభువులే నాకు పొద్దున్నే దర్శనం
మీయవలసిందే. ఎవరికోసం? మొగోడై పుట్టిన తర్వాత
యెవడికి బొచ్చుపెరగకుండా వుంటుంది. ఎవడో బైరాగి
ముండాకొడుకు తప్ప యెవడు గొరిగించుకోకుండావుంటాడు.
అందరికి నాతో అవసరమే. ఈదెబ్బ సంసోనుకు చేయడంలో కీ
యింకా మంచి పేరు రావాలి. చూసు నారిమాషా గుట్టు
చప్పుడుగా గొరిగొస్తా (నిష్క్రమణము]

(డెలీలా తొడలపై సంసోను నిద్రపోవు)

## ౨౬ జోలపాట.

జోజోజో వన్మోహన - సుకుమార।
యువతీ మానవ - చోరధీర ।జోజో।
ఘోరశాత్రవాంభోద సమీర - కోటిమన్మదాకార --శూర
పారావారగభీర సుధీర - వనితా భీష్టదవరమందార ।జోజో।

(పాటపాడుచుండగనే మంగలి వచ్చి క్షౌరముచేసి పోవును)

డెలీ:—సంసోనూ! సంసోనూ! లెమ్ము. లెమ్ము. ఫిలిస్త్రీయులు వచ్చు
చున్నారు. (సంసోను తుళ్ళిపడి లేచి తలతడవుకొని నిరుత్సా
హముగ]

సంసో:—ఓసీ! పాపాత్మురాల! నన్ను విరూపినిచేసి బలమపహరించి
తివా? [సర్దారులు భటసమేతులై ప్రవేశింతురు)

1 సర్దా:——భటులారా! చూచెదరేమి? బంధించుడు. (భటులు సంసో నునుబంధింతురు)

తే. గీ. పట్టుబడెనేడు జీవచ్ఛ ♦ వంబుమాడ్కి
నున్నవాఁడీతని మొగంబు ♦ వన్నెఁదరిగె
రండు భయమేల? యీతని ♦ గండడంగ
కొట్టు డీతని తలలోని ♦ క్రొవ్వడంగ 60

2 సర్దా:——ఓరీ! పాపాత్మా! నీకు ప్రాయశ్చిత్తము నేడుతప్పదు.

తే. గీ. పాలితుఁడవయ్యు స్వేచ్ఛగా ♦ ప్రభునిగతిగ
నాడితివి యింత దనుక నీ ♦ మాటలిపుడు
చెల్ల వక్షులు దీతుము ♦ చెఱకుయెట్లు
నురిగి పోదువు నీయబ్బ ♦ తరమె వెడల. 61

సంసోను:——హా! పరమాత్మా! నాశరీరము నాకేవశముగాకున్నది. ఏమియు చేయఁజాలకుంటిని తండ్రీ! దయతొలఁగించితివా?

తే. గీ. ఘోరశాత్రవులను కల ♦ గుండువఱచి
నాఁడ, నిల్లితి నేనొక ♦ నాతివలన;
ఆకసము నాక్రమించిన ♦ యంబుదంబు
గాలి వీవంగ వేగమే ♦ తూలునట్లు 62

1 సర్దా:——భటులారా! కసిదీర వీనికండ్లు తీసి గాజాశైలు నందుంచుడు. రేపు జరుగబోవు దాగోను దేవతామహోత్సవమునకు వీనిని హాజరు పెట్టుడి.

(యవనిక వ్రాలును)

—♦—

## నాలుగవ రంగము.

(గా జా జై లు)

(సంసోను తిరుగలి విసరుచుండ, భటులు పారాతిరుగుచుందురు)

సంసో:—(స్వగతము]

ఆ. వె. కండ్లుతీసినారు ♦ కనఁబడ దేమియు
యెంతపాపినైతి ♦ యేదిదిక్కు?
చాలినచ్చుచుండె ♦ సత్తువ లేదయ్యె,
తిరుగ లెటులఁబట్టి ♦ త్రిప్పవాఁడ. 63

హా! పరమాత్మా! ఒకసారి నా వెనుకటి జీవితచరిత్రను స్మరణకుఁ దెచ్చుకొనినచో, నేనెంత పాకిమాలిన జీవినైతిని? ఇశ్రాయేలీయ సంఘమునకు పెద్దనై, తీరువరినై యుండియు, సమాజ సముద్ధరణమునకు పూనుకొనక యౌవనమదాంధుఁడనై సంచరించితిని. స్వసంఘమునకుఁ జేసిన మేలేది? మీదు మిక్కిలి ఫిలిస్తీయులతో వారలకు తీరని వైరమును పొడిగించితిని. ఫిలిస్తీయుల యువతిని చేపట్టితిని. పెండ్లినాడు పురోహితుఁడగు సత్యమూర్తి ఉభయవంశములును విద్వేషములు మరచి పరస్పర సౌహార్దమున నుండుటకు మావివాహమును పేర్కొనెను. దురహంకారినై కట్టుకథను కల్పించి వారలను పరాభవింపఁ జొచ్చితిని. తిమ్నాతీయుఁడును సరోజయు యెంతబ్రతిమాలినను వారి బాంధవ్యమును కాలఁదన్ని చివరకు వారి వినాశనమునకే కారణమైతిని.

"వేశ్యలను విశ్వసింపకుము. వారల పొత్తుతగదు అని లోక మెంత బలవత్తరముగ చాటినను కాదని దెలీలా పొత్తునకు పోయి సుఖింప నుద్దేశించితి... చివరకేమైనది. ప్రభూ! వేయవలసిన శిక్ష నిర్దాక్షిణ్యముగ వేసితివి. నీయందలి విశ్వాసమును భక్తియు విధ్వంసక శక్తులను బలపరచుకొనుటకై వినియోగించు కొంటినే కాని ప్రశాంత సౌమ్యసాధుజీవనమునకై యపేక్షింపనైతిని.

దేవా! నీవగాప్రేమ్యుండవు. మంచిచెడుగులకు మనుజుండు కర్తా? నీవెటులాడించిన యటులాడునది కాదా యీలోకము।

కృపాసింధూ! నేనీ బాధభరింపఁజాల అంధత్వమునకు దోడు అవమానదాస్య దైన్యములు అధిగమించుచున్నవి. ఈప్రపంచమునుండి నన్ను నీదరికిఁ జేర్పుము

26 కీర్తన: చాయ : అబు తేరెసివా

పరమాత్మ శ్రీయెహోవనాడు - పాలకి దేవ।
కరుణించుమయ్యా నీదు - వరప్రభావసుతునిగా ॥పర॥
నిరతంబునీదు పాదపద్మ - ములను నుతింతుగా।
పరగర్వ మత్తమతితో - వర్తించితినయ్యా ॥పర॥
కడుదయాపరుఁడవైన పితా - సుతునిగావవా।
కలుషాత్ములైన ఫిలిస్తీయు లిటులఁజేసిరి।
శ్రీనిర్వికార నిర్మలాత్మ - నిర్గుణాతీత।
నిరతంబు నీదునామస్మరణా - స్మృతిమె గోరెదరా।
స్మరణాస్మృతిమె గోరెదరా।
అంధుండనైతినయ్యా - నన్ను ఆదరించవా।
పరమాత్మ! పరమాత్మ! పరమాత్మ!
బాధఁదీర్పనీ - పదములెగతిరా ॥పర॥

1 భటు:—నీకీ ముండమీద మోజు కావాలి. తిరగల్కి హినూ?
2 భటు:—బుర్రికి మున్నగా గొర్గించి పంపింది. దెలితా పీడ్కి.
1 భటు:—సర్దార్కి హాజర్ పెట్టమన్నాదు వీడ్కి పుచ్చుం క్యారే?
2 భటు:—ఉచ్చుంకిబాత్, తిరణాల్కి బోల్తాహైరే,
1 భటు:—తిరణాల్మె హేమిసేస్తార్?
2 భటు:—దాగోను దేవత్కి బలులు చేస్తార్.
1 భటు:—బలులు చేసేదికైకురే?
2 భటు:—దాగోన్ దేవత్కి సంసోనుకి పట్టీ హిచ్చింది. అందుకి బలులు కర్తాహైరే!

1 భటు:—వీక్కి డెలీలా పట్టిహిస్తే, దానోన్కి కైకురే? డెలీలాకి బఖులు చేస్తే బోత్ అచ్చాహై

2 భటు:—అరే సంసోను బాబూ! మాకీనక్కల్‌కి పట్టి హిస్తావ్?

1 భటు:—అరే! వీక్కిమూను నందల్ నక్కల్‌కి పట్టి, తోకల్ తోకల్‌కి కట్టి చేల్కితగల్ బెట్టాడ్, వీక్కిగాడిది దవడ్తో కొడ్తే, వెయ్యమందికి చచ్చార్.

2 భటు:—అరే! సంసోన్! నీకీ అచ్చావుండావ్, మాకీ తంటాకి తేకు నీకి తిరగల్ హిస్సు?

సంసో॥ దేవా! సర్వము నీవేకావా! నాచేత చేయించిన సాహస కృత్యములకు బలము నీవుకాదా? నన్నువరెంత హేళన చేసిన నేమి? తండ్రీ! దయాపరా!

సీ॥ కడుభయంకర సింహ ♦ గాత్రంబు రెండుగా
వ్రయ్యలు జేసిన ♦ బాహుబలము,
కథవేసిరిపుల ను ♦ గాంచి వారికి
దుస్తుల నొసంగిన ♦ దోర్బలంబు
గాడిద నెమ్ముకనే ♦ గైకొని రిపుల బ
ల్మిని సంహారించిన ♦ మేటిబలము
మాటి మాటికి శత్రు ♦ మండలిపై కొని
పీచమడంచిన ♦ పెన్బలంబు

తే॥ గీ॥ నీపవిత్రభావప్రపూరిత ♦ నిర్మలాత్మ
వచ్చి నాయందుఁజేరుట ♦ వలన గలిగె;
నేత్రహీనుఁడను జగ ♦ న్నేత నీవు
మోదయా పర, పరమాత్మ ♦ యోమహాత్మ.

(యవనిక వ్రాలును)

— ♦ —

## ఐదవ రంగము

(దాగోను దేవతాలయము - ఫిలిష్తీయుల సభ)

(భటులు సంసోనును సభలోనికి తీసుకొని వత్తురు)

సంసోను - 22 కీర్తన - చాయ : ఆడిగీబాపరే లే

దేవదీన పోషక । దేవ । దీనపోషక ॥దేవ॥

దిక్కునీవె కావె । కావరావె । దీనపోషక ॥దేవ॥

సదయుఁడవనినే । చాలగ నమ్మితి ।

అదయుఁడ వైతి । వహావా । దీనపోషక ॥దే॥

1 భటు:—అరె సంసోన్. కడోరె, కడో

2 భటు:—అరే కదిల్ తో, మెర్ల్లో, గల్లాకతరతం కబడ్దార్.

1 సర్దా (నిలబడి) మహాశయులారా! దాగోను దేవత చల్లని దయ వలన మనమందఱ మిచ్చటికిఁ జేరితిమి మనవిరోధియగు సంసోను యీ దేవత కృపవలన మనకుఁ జిక్కినాఁడు. మహాబలిని కృతజ్ఞతతోఁ నర్పించుదము. ఈ సంసోనును మీరెఱుగుదురుగదా! ఇతనిని పట్టుట కెన్ని ప్రయత్నములు చేసినను, అతనిలో దైవబలమున్నందున చిక్కలేదు. వేశ్యాలోలుఁడై నేటికీ పాపాత్ముఁడు మాకంటఁబడెను. ఈతని యండఁ జూచుకొని మనబానిసలగు యిశ్రాయేలీయులు పురిసిపోయి సిగ్గుమాలి తన సంఘమునకు స్వాతంత్ర్యమను పేరుతో వి మనలను ధిక్కరించెను ఈకండ్లులేని కబోది మనలనేమి చేయఁగలఁడు.

(అందరు నవ్వుచు చప్పట్లు కొట్టుదురు)